బ్రహ్మర్షి పత్రీజీ ఆశీస్సులతో....

# జ్ఞాన కుసుమాలు



రచన & ప్రచురణ : తటవర్తి వీరరాఘవరావు


| | | |
|---|---|---|
| ప్రథమ ముద్రణ | : | డిశంబరు, 2015 |
| ప్రతులు | : | 3,000 |
| ద్వితీయ ముద్రణ | : | ఫిబ్రవరి, 2021 |
| ప్రతులు | : | 1,000 |
| వెల | : | రూ. 70/-లు |



పుస్తకముల కొరకు

**తటవర్తి వీర రాఘవరావు**

**తటవర్తివారి వీధి, భీమవరం - 534 201. ప॥గో॥జిల్లా.**
**ఫోన్ : 08816 - 234353, సెల్ : 9440309812**
email : balajipyramid.bvrm@gmail.com

# విషయ సూచిక

# ‘అ’ అంటే

‘అ’ అంటే ఒక రకంగా చెత్త అని అర్థం.

మానవులకు పనికి రాని, నష్టం కలిగించే, కష్టాలు పాలు చేసే, దుఃఖం కలిగించే చెత్త అని తెలుసుకోవాలి.

పుట్టినపుడు ఎవరైనా చెత్తలేకుండా అంటే ‘అ’ లేకుండా పుడతారు. కానీ ఈ సమాజంలో ప్రవేశించగానే చెత్త పెంచుకుంటారు. అన్ని విషయాలలో ‘అ’ ప్రవేశిస్తుంది.

జీవితం సృష్టి విరుద్ధంగా సాగుతుంది. చివరకు దుఃఖమయం అవుతుంది. కారణం ఈ సమాజంలో వున్నది అంతా చెత్తే. ఈ సమాజంలో జీవించే వారికి ఎవరికైనా ‘అ’ అనే చెత్త అంటుకోకుండా వుండదు. కారణం వున్నది అదే కనుక.

“అ” ని చెత్త అని ఎందుకు అన్నారంటే

అజ్ఞానంలోని “అ” చెత్త.

అధర్మంలోని “అ” చెత్త. అలాగే

అక్రమం, అసత్యం, అవివేకం,

అన్యాయం, అశాంతి, అసంతృప్తి, అవినీతి లాంటి వాటిల్లో కూడా ‘అ’ చెత్తే.

ఇక్కడ ‘అ’ అనే చెత్తను తీసేస్తే మనకు వుండేది జ్ఞానం, ధర్మం, క్రమం, న్యాయం, నీతి, సత్యం, వివేకం, శాంతి.

ఈ సమాజంలో ప్రవేశించిన వారికి ఎదిగే కొద్దీ ఈ “అ” అనే చెత్త బాగా మందంగా పేరుకుపోతుంది. అందుచేత వారి ప్రవర్తన చాలా అసహ్యంగా తయారవుతుంది, లోక కంటకంగా తయారవుతుంది, అందరికీ నష్టం, కష్టం, బాధ కలిగించే విధంగా వుంటుంది, పూర్తిగా సృష్టి విరుద్ధంగా వుంటుంది.

అటువంటి వారు అజ్ఞానంతో ప్రవర్తిస్తారు. ధర్మంగా జీవించరు–అధర్మంగా జీవిస్తారు. సవ్యంగా వుండరు–అపసవ్యంగా వుంటారు. జీవితం క్రమంగా వుండదు–అక్రమంగా వుంటుంది, న్యాయంగా ప్రవర్తించరు–అన్యాయంగా ప్రవర్తిస్తారు, నీతిగా వుండరు–అవినీతికి పాల్పడుతూ వుంటారు, వివేకం వుండదు–అవివేకంతో ప్రవర్తిస్తారు, సత్యంలో జీవించరు–అసత్యంలోనే జీవిస్తారు.

ఈ రకమైన జీవితం, ప్రవర్తన సృష్టి విరుద్ధం కాబట్టి సృష్టి నియమాలననుసరించి వారికి శిక్షలు పడతాయి అంటే కష్టాలు వస్తాయి. అంటే

జీవితం దుఃఖమయం అవుతుంది.

అందుచేత ఎవరైనా సరే తప్పనిసరిగా ఈ 'అ' అనే చెత్తను తొలగించుకోవాలి. 'అ' అనే చెత్త పేరుకుపోకుండా జాగ్రత్తపడాలి. ఈ 'అ' అనే చెత్త మనస్సులో పేరుకుపోతుంది అనడానికి కారణం మనస్సును బట్టే మనిషి ప్రవర్తన వుంటుంది. మనస్సు చెడుగా వుంటే చెడు ప్రవర్తన, మంచిగా వుంటే మంచి ప్రవర్తన కలిగి వుంటారు. అందుచేత చెడు ప్రవర్తన వుంది అంటే మనస్సులో చెత్త పేరుకుపోయినట్టే!

చెత్త పేరుకుపోవటానికి కారణం చిన్న వాటినుండి తీసుకునే ఆహారం, చుట్టు ప్రక్కల వుండే వారితో సాంగత్యం. అందుచేత మనస్సులో వున్న 'అ' అనే చెత్త తొలగాలంటే మనస్సును చిన్న నాటి నుంచే శుద్ధి చేసుకుంటూ వుండాలి. ఇంట్లో పేరుకుపోయిన చెత్తను చీపురుతో ప్రతీరోజు శుభ్రం చేసుకుంటాం. ఒంటికి అంటుకున్న మురికిని సబ్బుతో శుభ్రం చేసుకుంటాం. జుట్టుకు అంటుకున్న చెత్తను షాంపూతో శుభ్రం చేసుకుని తొలగించుకుంటాం. బట్టకు అంటుకున్న మురికి సబ్బుతో శుభ్రం చేసుకుంటున్నాం.

అలాగే మనస్సులో పేరుకుపోయే 'అ' అనే చెత్తను ప్రతీరోజూ 'ధ్యానం' 'సాత్వికమైన శాకాహారం'తో శుభ్రం చెయ్యాలి, తొలగించుకోవాలి. అప్పుడే జీవితం శాంతిగా, ప్రశాంతంగా, సంతోషంగా, ఆనందంగా వుంటుంది.

నదులలో నీరు అక్రమంగా ఊళ్ళమీద ప్రవహించకూడదు, అలా ప్రవహిస్తే అందరికీ నష్టమే. సక్రమంగా సముద్రంవైపు ప్రవహించాలి. అలాగే మానవ జీవితం అక్రమంగా అందరికీ విరుద్ధంగా వుండకూడదు. సక్రమంగా అందరికీ ఆనందం కలిగించే విధంగా, లాభం కలిగించే విధంగా వుండాలి. అప్పుడే అందరికీ లాభం. అందుచేత జీవితం క్రమంగా వుండాలంటే అక్రమంలోని 'అ' అనే చెత్తపోవాలి. ముఖ్యంగా అన్ని రకాల చెత్త పోవాలంటే! 'అజ్ఞానం' లోని 'అ' అనే చెత్త పోవాలి. అపుడు వుండేది 'జ్ఞానం'. ఎప్పుడయితే 'జ్ఞానం' కలుగుతుందో అన్ని రకాల 'అ' అనే చెత్తలు పోతాయి. ఈ 'అజ్ఞానం' ధ్యానం వల్లనే పోతుంది.

అందుచేత 'అ' అనే చెత్తను తొలగించే 'ధ్యానం' ప్రతీ రోజు, ప్రతి ఒక్కరూ చెయ్యాలి. అందరూ ఆనందంగా జీవించాలి. అందరినీ ఆనందంగా జీవించనివ్వాలి. ఇదే మహావీరుని సందేశం.

"జీవించు – జీవించనివ్వు"

# సోది - సూది

సోది అంటే ప్రయోజనం లేని మాటలు, అవసరం లేని మాటలు, కాలక్షేపం కోసం మాట్లాడే మాటలు. మాటలే కాదు, కొన్ని రకాల ఉపన్యాసాలు కూడా ప్రయోజనం లేనివే. వీటి వల్ల మానవులలో పరివర్తన రాదు, అంటే ప్రవర్తన మారదు, పనులు మారవు, గుణాలు మారవు, జీవితంలో కష్టాలు, బాధలు, సమస్యలు పోవు. అంటే దుఃఖం పోదు. ఏ ప్రయోజనం వుండదు, సమయం వృధా కావడం తప్ప, 'సోది' కాలక్షేపానికి మాత్రమే పనికి వస్తుంది.

కొంతమంది ఇచ్చే ఉపన్యాసాలన్నీ 'సోదే'. ఎంత విన్నా ప్రయోజనం వుండదు. ఉత్తి కాలక్షేపానికి తప్ప. అవి సమయాన్ని గడపటానికి మాత్రమే పనికి వస్తాయి. కొన్ని కాలక్షేపానికి కూడా పని చెయ్యవు, విసుగు పుడుతుంది, బోర్ కొడుతుంది, చికాకు కలుగుతుంది, అక్కడ ఉండబుద్ధి కూడా కాదు. ప్రస్తుతం సమాజంలో మనకు ఈ 'సోదే' ఎక్కువ కనిపిస్తుంది. ఉత్తి ఉపన్యాసాలు, కాలక్షేపపు మాటలు, కాలక్షేపపు పనులు లాంటివి మనకు ఎక్కువ కనిపిస్తాయి. 'సోది' లోకంలో కొండంత వుంది.

కానీ 'సూది' అంటే 'జ్ఞానం'. ఈ 'జ్ఞానం' లోకంలో పెద్ద కొండ మీద వున్న చిన్న 'సూది'లా ప్రపంచంలో చాలా చాలా తక్కువగా వుంది.

కానీ ఈ 'సూది' అంటే 'జ్ఞానం' చాలా గొప్పది. ఇది మానవుని గుణాలు మారుస్తుంది, ప్రవర్తన మారుస్తుంది, పనులు మారుస్తుంది. జ్ఞానం పొందిన వారు సత్యయుతంగా జీవిస్తారు, ధర్మాచరణ చేస్తారు, శాస్త్రానుగుణంగా జీవిస్తారు, సృష్టికి అనుగుణంగా జీవిస్తారు, చివరకు దుఃఖాన్ని అధిగమిస్తారు, మోక్షాన్ని పొందుతారు.

ఈ 'సూది' అంటే 'జ్ఞానం' యోగులు మాత్రమే బోధించగలరు, పొందే మార్గం చూపించగలరు. వారు బోధించే 'ధ్యాన సాధన' వల్ల మాత్రమే ఎవరికైనా అతి సూక్ష్మమైన 'సూది' అంటే జ్ఞానం లభించగలదు. అందుచేత దుఃఖ నివారణ కోసం, సృష్టిలో అతి సూక్ష్మ రూపంలో వున్న ఈ 'సూది' అంటే జ్ఞానం, యోగుల ద్వారా పొంది దుఃఖం నుంచి బయటపడదాం. ముఖ్యంగా "ధ్యానం,స్వాధ్యాయం, యోగుల సాంగత్యం" చేద్దాం. అదే 'సూది'ని అంటే జ్ఞానాన్ని పొందే మార్గం. అందుచేత 'సోది' వదిలేద్దాం 'సూది'ని పొందే సాధనను చేద్దాం.

# సాధు సాంగత్యం

శాస్త్రాలలో ఈ సందేశం ఇవ్వబడింది. దాని అంతరార్థం తెలుసుకుందాం.

**సాధూనాం దర్శనం పుణ్యం**
**స్పర్శనం పాపనాశనం**
**సంభాషణం కోటి తీర్థం**
**కటాక్షం మోక్షదాయం**

దీని అర్థం సాధువులను అంటే యోగులను, జ్ఞానులను దర్శిస్తే పుణ్యం వస్తుందని కాదు. సంభాషిస్తే కోటి తీర్థాలలో సేవించినట్లవుతుందని కాదు – స్పర్శిస్తే పాపాలన్నీ నాశనమవుతాయని కాదు. అలాగే ఆయన కటాక్షం కలిగితే మోక్షం లభిస్తుందని కాదు. గొప్పవారు అలా చెప్పడంలో చాలా అంతరార్థం వుంది. అది తెలుసుకుంటే మనం కూడా సాధు దర్శనం వల్ల, స్పర్శనం వల్ల, సంభాషణ వల్ల, కటాక్షం వల్ల చెప్పబడిన ఫలితాలన్నీ పొందగలుగుతాం.

సాధు దర్శనం ఎందుకు పుణ్యమంటే! అంతటి గొప్పవారైన జ్ఞానులు, యోగులు, మహర్షులను దర్శించక పోవడం వల్లే అంటే కలవకపోవడం వల్లే మానవులకు ఏమి చెయ్యాలో తెలియక, చెయ్యకూడని పనులు, పాపాలు చేస్తున్నారు, కష్టాలపాలవుతున్నారు. కానీ అటువంటి వారిని దర్శించడం వల్ల వారి బోధలు, సందేశాలు వినడం వల్ల, వారు చేసే కార్యక్రమాలు, మంచి పనులు, లోకకళ్యాణకరమైన పనులు చూడటం వల్ల ఉత్తేజితులై తాము కూడా అలాంటి పనులు, పుణ్యకార్యాలు చేస్తారు. అలా చేయడం వల్ల పుణ్యం సంపాదించు కోగలుగుతారు. అందుకే సాధు దర్శనం పుణ్యం అన్నారు. అందుచేత మహాత్ములను దర్శించాలి. వారి సందేశాలను ఆచరణలో పెట్టాలి. వారిని ఆదర్శంగా తీసుకోవాలి. వారి మార్గంలో పయనించాలి. అదే మనకు లభించే పుణ్యం.

అలాగే సాధువులతో సంభాషించడం కోటి తీర్థాలు సేవించినట్లవు తుంది, అంటే తిరిగినట్లవుతుంది అన్నారు. అంటే అటువంటి జ్ఞానులకు ఈ సృష్టిలో తెలియంది అంటూ ఏదీ వుండదు. వారు ఈ సృష్టిలోని సమస్త లోకాల జ్ఞానం కలిగి వుంటారు. వారు ఎంతో మంది జ్ఞానుల సాంగత్యం చేసి వుంటారు. ఈ సృష్టిలోని ఎన్నో వింతలు, విశేషాలు దివ్యదృష్టి ద్వారా చూడటం, జ్ఞాననేత్రం

ద్వారా తెలుసుకోవడం వల్ల అటువంటి వారితో సంభాషించడం వల్ల ఆ విషయాలన్నీ తెలుసుకోగలుగుతారు, అనేక లోకాలలోని జ్ఞానాన్ని పొందగలుగుతారు. అందుచేత కోటి తీర్థాలు తిరిగిన అనుభవం, జ్ఞానం పొందగలుగుతారు. అందుచేత సంభాషించడం కోటి తీర్థం అన్నారు.

అలాగే స్పర్శనం అంటే సాంగత్యం పాప నాశనం అనటానికి కారణం అలాంటి వారికి సమస్తం తెలుస్తాయి. మానవులు చేసిన పాపాలు పోయే మార్గం, సాధనలు వారికి తెలుస్తాయి. అందుచేత అటువంటి వారి సాంగత్యం వల్ల ఆ మార్గం తెలుసుకుని ఆ సాధనలు చెయ్యడం వల్ల, ఆ మార్గాన్ని అనుసరించడం వల్ల, ఆ ప్రయత్నం చేయడం వల్ల వారి పాపాలు తేలికగా తొలగిపోతాయి. అందుచేత సాధు స్పర్శనం అంటే సాంగత్యంలో అంటే వారికి దగ్గరగా వుంటూ సేవ చేస్తూ వారు చెప్పింది ఆచరించటంతో పాపాలన్నీ నాశనమవుతాయని అర్థం.

అలాగే కటాక్షం వల్ల మోక్షం లభిస్తుంది అని ఎందుకు అన్నారంటే! ఎవరైతే అటువంటి జ్ఞానులను ఆశ్రయించి సేవ చేస్తారో వారికి ఆ జ్ఞానుల యొక్క అనుగ్రహం కలుగుతుంది. అప్పుడు వారు ప్రసన్నులై వారికి మోక్షాన్ని పొందే మార్గాన్ని భోధిస్తారు. అపుడు వారు తేలికగా ఆ మార్గాన్ని అనుసరించి గమ్యాన్ని చేరుకుంటారు అంటే మోక్షం పొందుతారని అర్థం.

ఇక్కడ తెలుసుకోవలసింది ఏమిటంవటే కటాక్షంతో మోక్షం రాదు. కారణం ఈ సృష్టిలో ఎవరూ ఎవరికి మోక్షాన్ని ఇవ్వలేరు. కటాక్షం వల్ల మోక్ష మార్గాన్ని తెలుసుకోగలుగుతారు. మార్గం తెలుసుకోవడం వల్ల తీవ్రమైన స్వయం సాధనతో మోక్షాన్ని పొందగలుగుతారు. అందుకే భగవద్గీతలో "ఉద్దరేదాత్మ నాత్మానం" అని చెప్పబడింది. అంటే ఎవరిని వారే ఉద్ధరించుకోవాలని అర్థం.

అందుచేత కటాక్షం వల్ల మోక్షం రాదు. మోక్ష మార్గం మాత్రమే తెలుస్తుంది అని తెలుసుకోవాలి.

అంతేకానీ సాధువులను వూరికే ఒకసారి చూసినంత మాత్రాన ఏ పుణ్యం రాదు, స్పర్శిస్తే పాపాలు పోవు, సంభాషిస్తే కోటి తీర్థాలు తిరిగినట్టు కాదు, కటాక్షం వల్ల మోక్షం రాదు. మహాత్ములు ఏమి చెప్పినా దానికి ఎంతో అర్థం వుంటుంది, అంతరార్థం వుంటుంది. అందుచేత ఆ అంతరార్థాన్ని తెలుసుకుని ఆచరణలో పెడితే ఆ ఫలితం తప్పకుండా పొందగలుగుతాం. అందులో సందేహం లేదు.

# గజేంద్ర మోక్షం



ఇక్కడ మనం ఒక విషయం గుర్తుంచుకోవాలి. గొప్పవాళ్ళు లోకానికి అందించిన పురాణాలన్నీ సందేశాత్మకమైనవే. వాటి ద్వారా మానవాళికి ఒక సందేశం ఇవ్వడమే వారి ఉద్దేశ్యం. మానవులలో మంచి మార్పు తీసుకురావడమే వారి ఉద్దేశ్యం. వూరికే చెపితే అర్థం కాదు కనుక ఒక పురాణ కథ ద్వారా వారు ఇవ్వవలసిన సందేశాన్ని ఇస్తూ వుంటారు.

అందుచేత ఏ పురాణాన్నైనా కథ క్రింద చదవకుండా అసలు దాని ద్వారా ఇవ్వబడిన సందేశమేమిటని ఆలోచించాలి. ఆ సందేశాన్ని అర్థం చేసుకుని ఆచరణలో పెట్టటానికి ప్రయత్నించాలి. అలా చేసిన వారు జీవితంలో ఎంతో

లాభం పొందుతారు. అంటే దుఃఖం నుంచి బయటపడతారు

అలాగే 'గజేంద్రమోక్షం'లోని సందేశాన్ని మనం తెలుసుకుందాం.

ఒక బలమైన గజరాజు నీళ్ళలో వున్న మొసలి బారిన పడి తప్పించుకోవటానికి విఫలయత్నం చేసింది. తప్పించుకోలేక ఎంతో బాధ అనుభవించింది. బయటపడటానికి తన శక్తిని, యుక్తిని ఉపయోగించింది. కానీ ఆ గజం మొసలి బంధం నుంచి బయటపడలేకపోయింది.

అలాంటి గజం చేసేది ఏమీ లేక చివరకు నారాయణుని అంటే విష్ణుమూర్తిని ప్రార్థించింది. అంటే భగవంతుని ప్రార్థించింది. అపుడు విష్ణుమూర్తి వచ్చి ముసలిని సంహరించి గజాన్ని రక్షించాడు. బాధ నుంచి విముక్తి చేసాడు అన్నదే పురాణ కథ.

అలాగే జీవుడు అంటే మానవుడు భవబంధంలో అంటే సంసార బంధంలో చిక్కుకుని తప్పించుకోలేక నానా బాధలు అనుభవిస్తున్నాడు. బయటపడటానికి రకరకాల ప్రయత్నాలు చేస్తున్నాడు. పూజలు చేస్తున్నాడు, భజనలు చేస్తున్నాడు, స్తోత్రాలు చదువుతున్నాడు, జపాలు చేస్తున్నాడు. యజ్ఞాలు, యాగాలు చేస్తున్నాడు. ప్రార్థనలు చేస్తున్నాడు. నమాజు చేస్తున్నాడు. రకకాల గురువులను ఆశ్రయిస్తున్నాడు. పుణ్య క్షేత్రాలు దర్శిస్తున్నాడు. ఇలా ఎన్నో ప్రయత్నాలు చేస్తున్నాడు. కానీ బయటపడలేక పోతున్నాడు. అంటే మోక్షం పొందలేకపోతున్నాడు.

అలాంటి మానవుడు భవబంధం నుంచి అంటే దుఃఖం నుంచి బయటపడాలంటే మోక్షం పొందాలంటే? నారాయణుడు అంటే 'ఆత్మ'ను ఆశ్రయించాలని అర్థం. అలా ఆత్మను ఆశ్రయించి 'ఆత్మజ్ఞానం' పొందితే! నారాయణుడు ముసలిని సంహరించినట్లు... మానవుని కర్మలన్నీ దగ్ధమవుతాయి, దుఃఖం అనే మొసలి నుంచి విముక్తుడవుతాడు. ఈ సంసార బంధం నుంచి బయటపడతాడు. అంటే మోక్షం పొందుతాడు. అంటే మానవుడు దుఃఖం నుంచి బయటపడగలిగే మార్గం ఒక్కటే. అదే భగవంతుని ఆశ్రయించడం అంటే 'ఆత్మ'ను ఆశ్రయించడం. 'ఆత్మ'ను ఆశ్రయించే మార్గమే 'ధ్యానం'. అందుచేత 'ధ్యానం' ద్వారా అంతరంలోని ఆత్మను ఆశ్రయించాలి. ఇదే గజేంద్ర మోక్షం యొక్క అంతరార్థం.

# విభూతి ఎందుకు ?

షిరిడీ బాబాకు విభూతి అంటే ఇష్టం. ఆయన దగ్గరకు ఎవరు వచ్చినా విభూతి ఇస్తుంటారు. అందరి చేత విభూతిని ధరింప చేస్తారు. ఆయన విభూతికి విశేషమైన ప్రాముఖ్యం ఇస్తారు. అందుచేత అందులోని అంతరార్థం తెలుసుకుందాం.

బాబా ఉద్దేశ్యం ఎప్పటికైనా ఎవరైనా బూడిదలో కలవాల్సిందే. అంతేకాదు ఈ లోకంలోని సంపదలన్నీ బూడిదతో సమానం. అందుచేత వాటి మీద మమకారం పెంచుకోకండి అని గుర్తు చేయటానికే. విభూతిని పంచుతారు.

అందుకే చూడండి ఆయన చిరిగిపోయిన వస్త్రాలు ధరిస్తారు. చూసే వారికి బిచ్చగాడిలా కనిపిస్తారు. ఆభరణాలు ధరించరు. మసీదులో జీవిస్తారు. చేతిలో బిక్షాపాత్ర మాత్రమే వుంటుంది. వీధులలో తిరిగి బిచ్చం అడుగుతూ వుంటారు. చాలా సామాన్యమైన జీవితాన్ని గడుపుతారు. తన దగ్గరకు వచ్చిన వారికి విభూతి ఇస్తూ వుంటారు. ఆ రకంగా ఆయన జీవించారంటే ఏదో అంతరార్థం లేకుండా వుండదు.

ఎందుచేతనంటే లోకంలో ఎంతోమంది ఇపుడు బాబాను ఆరాధిస్తున్నారు, నిత్యం కొలుస్తున్నారు, హారతులు ఇస్తున్నారు. దేనికి? అంటే బాబా అనుగ్రహం కోసం. ఎందుకు? అంటే బాబా ఎంతో శక్తిమంతుడు, ఆయన వద్ద ఎన్నో శక్తులు వున్నాయి. ఎన్నో మహిమలు కలవాడు. ఎంతో మందిని ఆదుకున్నాడు. అందుచేత ఆయన్ను ఆశ్రయిస్తే, ఆయన అనుగ్రహాన్ని సంపాదించగలిగితే ఆయన వద్ద వున్న శక్తిలో కొద్దిపాటి శక్తి మనకు ప్రసాదించగలిగితే మన కష్టాలన్నీ తీరిపోతాయి, మన సమస్యలన్నీ తొలగిపోతాయి, మనం ధనవంతులు కావచ్చు. సంపదలతో తులతూగవచ్చు అని భావిస్తూ ఆయనను కష్టాలు తొలగించమని, సంపదలు ప్రసాదించమని, ధనవంతుణ్ణి చేయమని ప్రార్థిస్తూ వుంటారు.

ఇక్కడ ఆలోచిస్తే వేటినయితే విలువలేనివని, పనికి రానివని, ఆయన భావించారో! బూడిదతో సమానమని భావించి వాటికి ప్రాముఖ్యం ఇవ్వకుండా జీవించారో, ఈ అజ్ఞానపు మానవులంతా ఆ సంపదలనే ఇవ్వమని ఆయన్ను ప్రార్థిస్తున్నారు, వేడుకుంటున్నారు. కొద్దిగా ఆయన శక్తి తమ మీద ప్రసర్తిస్తే తాము సంపదలు పొందవచ్చని భావిస్తున్నారు. కానీ అంతకన్నా ఆలోచించడం లేదు. ఆయన ఆచరించి చూపించినా కూడా అర్థం చేసుకోవడం లేదు.

ఆలోచించండి ఆయన వద్ద వున్న అనంతశక్తిలో కొద్దిగా ఇచ్చినా తాము ధనవంతులు కావచ్చని భావిస్తున్నారే! మరి కొద్ది శక్తికే వీరు ధనవంతులు కాగలిగినపుడు అంతశక్తి కలిగిన ఆయన, తన శక్తితో రాజమందిరాలే నిర్మించుకోవచ్చు కదా? పెద్ద పెద్ద భవంతులే నిర్మించుకోవచ్చు కదా? హాయిగా, వైభవంగా వుండవచ్చు కదా? మరి ఇవన్నీ ఎందుకు చెయ్యలేదు? ఎందుకు బికారిలా, ఏమీ లేనివాడిలా, బిచ్చగాడిలా జీవించాడు? అంటే ఆయనకు ఏమీ తెలియకనా? సుఖాలు అనుభవించలేకనా? ఆలోచించండి.

ఆయన ఈ సంపదలనన్నిటిని బూడిదతో సమానంగా భావించి పెంటమీద వేసినట్టుగా చూసాడే! అంటే అటువంటి ఆయన అంత మహిమాన్వితుడు, శక్తిమంతుడు అటువంటి వాటికి ప్రాముఖ్యం ఇవ్వలేదంటే ఏదో కారణం వుండే వుంటుంది కదా? అదే అందరూ తెలుసుకోవాలి. తెలుసుకోవడమే కాదు. ఆయన దేనికి ప్రాముఖ్యం ఇస్తే, అందరూ దానికే ప్రాముఖ్యం ఇవ్వాలి. ఆయన జీవితాన్ని ఆదర్శంగా తీసుకోవాలి.

నీటితో దీపాలను వెలిగించగలిగిన వాడు సంపదలు సృష్టించుకోలేడా? ఆలోచించండి? అంటే ఆయన ఎందుకు అలా జీవించాడు? ఆయన తెలుసుకున్న సత్యాన్ని అందరికీ బోధించడానికే అలా జీవించాడు. దాని అర్థాన్ని తెలియ పరచడానికే ఆయన అందరికీ విభూతిని పంచాడు.

అందుచేత అర్థం చేసుకోండి ఈ ప్రపంచంలోని సంపదలన్నీ బూడిదతో సమానం. ఏవీ వుండవు. అన్నీ అశాశ్వతమే. అన్నీ పోయేవే. అవి దుఃఖాన్ని పెంచేవే కానీ, అందరూ అనుకున్నట్టు అవి ఆనందాన్ని ఇవ్వలేవు.

అందుచేత ఉన్నవాటితో తృప్తి పడి, త్యాగబుద్ధితో అనుభవించాలి. ఎవరివీ ఆశించకూడదు. ఎవరివీ అపహరించకూడదు. ఎవరినీ మోసగించ కూడదు. వాటి కోసం తప్పులు, పాపాలు చెయ్యకూడదు. అధర్మంగా ప్రవర్తించ కూడదు. అలా చేస్తే వాటి వల్ల సుఖాల మాట అలా వుంచి కష్టాల పాలవుతారు దుఃఖం పొందుతారు. అందుచేత ఈ సంపదల మీద మమకారం పెంచుకోవద్దు అని చెప్పడమే ఆయన విభూతి ఇవ్వడంలోని అంతరార్థం. అంతేకాదు ఈ సందేశం మర్చిపోకుండా వుండటానికే అందరి చేత విభూతి ధరింపచేయడంలోని అంతరార్థం.

మరి షిరిడీ బాబా వారి సందేశం అర్థం కావాలంటే ఆయనంత కాక పోయినా ఆయనలో కొంత జ్ఞానాన్నైనా పొందాలి. అటువంటి జ్ఞానం 'ధ్యానం' ద్వారానే వస్తుంది. అందుచేత 'ధ్యానం' చెయ్యండి. 'జ్ఞానం' పొందండి. షిరిడీ బాబా వారి సందేశం అర్థం చేసుకోండి. ఆనందంగా జీవించండి.

# ఆదర్శమూర్తులు



సహజంగా మహాత్ముల, దేవుళ్ళ ఫోటోలు, బొమ్మలు గృహాలలో, ఆఫీసుల్లో, ఫ్యాక్టరీల్లో ఇంకా అనేక చోట్ల పెడుతూ వుంటారు. అలాగే విగ్రహాలను మందిరాలలో ఉంచుతారు. అలా ఉంచడమే కాదు ఆరాధిస్తూ వుంటారు. కోరికలు కోరుతూ వుంటారు.

కానీ అటువంటి వారి ఫోటోలు అలా వుంచడానికి కారణం వారిని ఆదర్శంగా తీసుకోవడానికే కానీ ఆరాధించి కోరికలు కోరడానికి కాదు. అవన్నీ **"ఆదర్శ మూర్తులే కానీ ఆరాధనా మూర్తులు కాదు".** అవి **"వారి ప్రతిరూపాలే కానీ వారు కాదు".** వారే అయితే అలా గోడకు వ్రేలాడదీస్తామా? వారు కదలకుండా అలా గోడకు వేలాడుతూ వుంటారా? అందుకే వాటికి చెదలు పట్టినా ఇళ్ళు మారేటపుడు శుభ్రం చేసేటపుడు డామేజీ అయినా పారేస్తున్నాం, మారుస్తున్నాం.

ముఖ్యంగా ఫోటోలు ఇళ్ళలో వుంచడానికి కారణం వారు వున్నారని గుర్తు చేసుకోవడానికే. అవే లేకపోతే వారు అసలు గుర్తుకు రానే రారు. అలా ప్రతిరోజు ఆ ఫోటో చూడగానే వారు గుర్తుకు రావడమే కాదు. వారు జీవించిన జీవిత విధానం గుర్తుకు వస్తుంది. వారు జీవితంలో ఇచ్చిన సందేశాలు గుర్తుకు వస్తాయి. దానిని బట్టి మనం ఎలా జీవించాలి? ఎలా ప్రవర్తించాలి? అన్నది తెలుస్తుంది. ఏమైనా మన ప్రవర్తనలో, పనులలో లోపాలు, తప్పులు వుంటే సరి చేసుకునే వీలువుంటుంది. అలా సరి చేసుకుంటే తప్పకుండా జీవితంలో లాభాలు కలుగుతాయి, ఆనందం కలుగుతుంది.

ఆ ఫోటోయే చూడకపోతే వారే గుర్తుకురారు, వారే గుర్తుకు రాకపోతే వారి సందేశాలు ఎలా గుర్తు చేసుకుంటాం? వారి సందేశాలే గుర్తు తెచ్చుకోకపోతే

మనం తప్పు చేస్తున్నామా? ఒప్పు చేస్తున్నామా? సరిగ్గా జీవిస్తున్నామా? లేదా? అన్నది ఎలా తెలుస్తుంది? సరి చేసుకునే అవకాశం ఎలా కలుగుతుంది? చెప్పండి? అందుచేత ఫోటోలు వుంచాలి. తప్పకుండా వుంచాలి. ఆదర్శం కోసం వుంచాలి. ఎందుచేతనంటే ఫోటోలను ఆరాధించే వారికి ఏమీ రాదు. కానీ ఆదర్శంగా తీసుకునే వారికి  అన్నీ లాభాలే. కారణం వారి మార్గంలో నడవడం కంటే గొప్ప పని ఏమి వుంది? ఆ మార్గంలో నడిచే కదా? వారు గొప్పవారు అయ్యారు.

అందుచేత గొప్పవారి ఫోటోలు తప్పనిసరిగా పెట్టాలి. ఫోటోలు పెట్టడంలో నష్టం లేదు. వారు చెప్పిన వాటిని ఆచరించక పోతేనే నష్టం. కానీ వారి మార్గంలో నడవకపోతేనే నష్టం. వారి సందేశాలను మరచిపోతేనే నష్టం.

ఇప్పుడు వారంతా ప్రత్యక్షంగా భూమి మీద లేకపోయినా వారి సందేశాలు మాత్రం ఇప్పటికీ పవిత్ర గ్రంథాల రూపంలో భూమి మీద వున్నాయి. వాటిని మనం అధ్యయనం చేసి ఆచరిస్తే తరించే అవకాశం వుంది.

అలాగే మందిరాలలో వుండే దేవుని విగ్రహాలు కూడా వారిని గుర్తు చేసుకోవటానికే. అవే లేకపోతే వారు వున్నారన్న సంగతి ఎలా తెలుస్తుంది? వారి సందేశాలు ఎలా తెలుస్తాయి? వారు బోధించిన ధర్మసూక్ష్మాలు ఎలా తెలుస్తాయి? అసలు ఎలా జీవించాలో! ఎలా జీవించకూడదో ఎలా తెలుస్తుంది? అవి అన్నీ కూడా మనల్ని సరైన మార్గంలో నడిపించటానికే. వారు గుర్తుకు రావాలంటే ఏదో ఒకటి వుండాలి కదా? అందుకే ఇవన్నీ.

వారంతా మనకు మార్గం చూపించడానికి, మన తప్పులు సరి చేయటానికే భూమి మీదకు వచ్చారు. రావడమే కాదు ఏమయితే వారు బోధించారో వారు బోధించిన సత్యాలు, ధర్మాలు ఆచరించి చూపించారు. వారి జీవితం ద్వారా మనకు బాగా అర్థమయ్యే రీతిలో తెలియ చేశారు. అందుచేత మన పని వారి మార్గంలో పయనించడమే! జీవించడమే!

అందుచేత మనం కూడా వారందరిలా జ్ఞానవంతులు అవుదాం. మన జీవితాలను వారిలానే ధన్యం చేసుకుందాం.

# శ్రీశైలం - కైలాసం



శ్రీశైలం అన్నది పుణ్య క్షేత్రం.

కైలాసమన్నది తీర్థం.

పుణ్య క్షేత్రాలలో శివుని ప్రతిరూపం అంటే శివలింగం వుంటుంది. కానీ తీర్థంలో అంటే కైలాసంలో శివుడే వుంటాడు.

శివుని ప్రతి రూపం అంటే శివలింగం వుండే శ్రీశైలం, కాశీ, రామేశ్వరరాలు, శివుడనే వాడు వున్నాడని తెలియ చేస్తాయి. శివుని మరచిపోకుండా గుర్తు చేస్తాయి. కానీ శివుని దగ్గరకు చేర్చలేవు, శివుని దర్శింప చేయలేవు, అందుకే పుణ్య క్షేత్రాలు అన్నారు.

కానీ సాక్షాత్తూ శివుడు వుండే కైలాసం... శివుని దర్శనం కలిగించడమే కాదు, శివుని దగ్గరకే చేరుస్తుంది, తరింపచేస్తుంది. అందుకే తీర్థం అన్నారు. కారణం 'తరింప చేసేదే తీర్థం' కనుక. సత్యమైన శివుని దర్శించిన వారు తప్పక తరించి తీరుతారు. అంటే కష్టాల తీరం దాటుతారు.

మరి కైలాసం ఎక్కడ వుంది? కైలాసంలో వున్న శివుణ్ణి ఎలా దర్శించాలి?

శివుడు వుండే అలాంటి కైలాసమే మానవ దేహం. మానవ దేహమే అసలైన 'కైలాసం'. కారణం మానవ దేహంలోనే సత్యమైన శివుడు వుండేది.

అందుకే దేహాన్ని దేవాలయంగాను, దేహంలో వుండే జీవుణ్ణి దేవుడు

అంటే శివుడుగాను శంకరాచార్యులు వారు పేర్కొన్నారు.

ఆయన “దేహోదేవాలయో ప్రోక్తః జీవోదేవో సనాతనః ” అన్నారు. అందుచేత దేహంలో వుండే జీవుడే శివుడు అని తెలుసుకోవాలి.

అందుకే ఆ జీవుడు అంటే శివుడు దేహంలో వుంటే ఆ దేహాన్ని శివం అంటారు. ఆ జీవుడు అంటే శివుడు లేకపోతే ఆ దేహాన్ని ‘శవం’ అని అంటారు.

అందుచేత శివుడు శరీరంలో వున్నాడు కాబట్టి శివుడు వుండేది కైలాసం కాబట్టి. మానవ దేహమే కైలాసం అని తెలుసుకోవాలి. ఈ విషయాన్నే వేమన యోగి కూడా చెప్పడం జరిగింది.



**“శిలలను చూసి నరులు శివుడని భావింత్రు,**
**శిలలు, శిలలె కాని శివుడు కాదు,**
**తనదులోని శివుని తానేల తెలియడో**
**విశ్వధాభిరామ వినురవేమ”**

తా:- మానవుడు శిలలతో తయారైన విగ్రహాలను చూసి శివుడని భావిస్తున్నారు. కానీ శిల.. శిలే అవుతుంది కానీ శివుడు అవ్వడు కదా? ఈ మానవులు తనలో వున్న అసలైన శివుణ్ణి ఎందుకు తెలుసుకోలేకపోతున్నారో? అర్థం కావట్లేదని వేమన చెపుతున్నారు.

దీనిని బట్టి మానవ దేహంలోనే శివుడు వున్నాడని అర్థం అవుతుంది. శివుడు వుండే ప్రదేశమే కైలాసం. అందుచేత మానవదేహమే నిజమైన కైలాసం. ఎవరైతే “ధ్యానం” ద్వారా శరీరంలోకి ప్రవేశిస్తారో వారు కైలాసానికి చేరుకుంటారు. సాక్షాత్తూ శివుని దర్శిస్తారు. మోక్షాన్ని పొందుతారు. ఇదే వేమన సందేశం.

అలా తీర్థంలో మానవుడు శివుని దర్శించడం వల్ల మానవుడు తరిస్తాడు. అంటే ముక్తిని పొందుతాడు. అంటే శాశ్వత ఆనందం పొందుతాడు.

అందుచేత శ్రీశైలం, కాశీ, రామేశ్వరాలు పుణ్యాన్ని సంపాదించి పెడతాయి కాబట్టి పుణ్యక్షేత్రాలు అంటారు. కానీ మానవ దేహం ముక్తిని సంపాదించి పెడుతుంది కాబట్టి నిజమైన తీర్థం మానవ దేహమే.

అందుకే శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి వారు ఇలా అన్నారు.



**"తీర్థ యాత్రలందు దేవుడొక్కడె గదా!**
**మంచి తీర్థము మన పంచెనుండె**
**దివ్యతీర్థమిదిగో దేహమందున్నది**
**కాళికాంబ! హంస! కాళికాంబ"**

తా:- ఎన్ని యాత్రలకు పోయినా, ఎన్ని క్షేత్రాలు తిరిగినా దేవుడు ఒక్కడే కదా? అన్నిటి కంటే మంచి తీర్థం మన దగ్గరే వుంది. అటువంటి దివ్యతీర్థం మన దేహంలోనే వుంది అని చెప్పడం జరిగింది.

అంటే మానవ దేహమే దివ్యమైన తీర్థమని వీరబ్రహ్మేంద్రస్వామి కూడా చెప్పారు. ఆయన ఇంకా

**వెదకి వెదకి వేసారి వేసారి**
**అచట నిచట లేదటంచు నెంచి**
**తరచి చూచి తాను తనలోన గనుగొనె**
**కాళికాంబ! హంస ! కాళికాంబ**

తా:- శివుని కోసం అన్ని చోట్లా వెదకి.. వెదకి... అక్కడ లేదు... ఇక్కడ లేదని తెలుసుకొని... విసుగు చెంది చివరికి ధ్యానం ద్వారా ఆ శివుణ్ణి తనలోనే దర్శించాడు.

శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి వారు కూడా శివుడు మానవదేహంలో వున్నాడని చెప్పడం జరిగింది. అందుచేత అవసలైన తీర్థం అంటే కైలాసం మానవదేహమే అని తెలుసుకోండి. శ్రీశైలం, కాశీ, రామేశ్వరాల చుట్టూ తిరగడం కాదు. ధ్యానం చెయ్యండి. శివుణ్ణి దర్శించండి. తరించండి అంటే మోక్షాన్ని పొందండి.

# జీవ హింస - జీవహత్య

**జీవహింస :** 'జీవుడు' అంటే 'శివుడు' అంటే 'దేవుడు' శరీరంలో వుండగా బాధిస్తే, అంటే హింసిస్తే దానిని 'జీవహింస' అంటారు.

**జీవహత్య :** 'జీవుడు' అంటే 'శివుడి'ని అంటే 'దేవుడిని' శరీరంలో వుండడానికి వీలులేకుండా శరీరాన్ని విచ్ఛిత్తి చేసి, శరీరం నుండి బలవంతంగా వేరు చేస్తే 'జీవహత్య' అంటారు.

అలా 'దేవుడు' అంటే 'శివుడు' శరీరంలో వున్నప్పుడు హింసించడం పాపమవుతే, 'శివుడు' అంటే 'జీవుడిని' శరీరంలో లేకుండా చెయ్యడం మహాపాపం అవుతుంది.

ఎందుచేతనంటే 'జీవుడు' వుంటే 'శివమంటారు'. 'జీవుడు' లేకపోతే 'శవం' అంటారు. చూడండి శివుడు లేని తండ్రి శవాన్ని కొడుకు చేతే కాల్పిస్తారు. అందరూ దగ్గర వుండి ఆ పని చేయిస్తారు. అలా తండ్రిని కొడుకు కాల్చినా పాపమని అనరు. పైగా అది పుణ్య కార్యమంటారు.

కానీ అదే తండ్రి శరీరాన్ని 'శివం' అంటే 'జీవుడు' వుండగా కాలిస్తే వూరుకుంటారా? కాల్చనిస్తారా? ఎంత అప్రాచ్యపు పని చేస్తున్నావురా? ఎంత పాపం చేస్తున్నావురా? నీకు పుట్టగతులు వుండవురా? అని తిడతారు, అడ్డుకుంటారు, మహాపాపం అంటారు. ఆ పని చెయ్యనివ్వరు.

కారణం శివం వుంటేనే తండ్రి, శివం లేకపోతే తండ్రి కాదు... అది శవం అవుతుంది. శవాన్ని కాల్చినా తప్పు లేదు, పాపం కాదు. మరి ఆ శరీరానికి అంత విలువ ఎలా వచ్చింది? 'శివం' వల్ల అంటే 'జీవుడు' వల్ల వచ్చింది.

అందుచేత శివం అంటే జీవుడు వున్న ఏ శరీరాన్ని బాధించకూడదు, హింసించకూడదు, కాల్చకూడదు, హత్య చెయ్యకూడదు. అందుకే జీవహింస,

పాపము, జీవహత్య మహాపాపమని తెలుసుకోండి.

అందుకే పత్రీజీ మీకు కావాలంటే శవాన్ని తినండి.  తప్పులేదు అంటారు కారణం శివమున్న శరీరానికి బాధ వుంటుంది. శివం లేని శవానికి బాధ వుండదు. అందుచేత జీవమున్న శరీరాన్ని ఏమీ చెయ్యకూడదు. శవాన్ని ఏమి చేసుకున్నా ఫరవాలేదు అంటారు.

దీనిని బట్టి శరీరానికి బాధ 'శివం' వున్నప్పుడే అంటే 'ఆత్మ' వున్నప్పుడే అన్న విషయం గ్రహించాలి.

అందుచేత సహజంగా చచ్చిన దానిని తినవచ్చు కానీ, చంపి తినకూడదు. బలవంతంగా చంపితే హింస కలుగుతుంది. అందుచేత హింసించి, చంపి తినకూడదు.

అందుకే 'శివం' అంటే 'మాధవుడు' వున్న శరీరానికి సేవ చేస్తే, ఆనందం కలిగిస్తే మాధవసేవ అంటారు. అందుకే "మానవసేవే, మాధవ సేవ" అంటారు. అంతేకాదు 'శివం' వున్న శరీరం 'శివుడి'తో సమానం. అందుకే మానవుడే మాధవుడంటారు.

అందుచేత 'జీవహింస' చేయకూడదు, 'జీవుల హత్య' చేయకూడదు. ఇదంతా 'జ్ఞానం' కలిగినపుడే తెలుస్తుంది.

# తడిసి మోపెడు

సహజంగా సమాజంలో ఎన్నో పదాలు వాడేస్తుంటారు. ఎన్నో సామెతలు చెప్పేస్తుంటారు. కానీ వాటి అర్థం వాడే వారికే పూర్తిగా తెలియదు.

కానీ పత్రీజీ ఏ పదానికైనా అర్థం చెబుతారు. అలాగే సమాజంలో వాడుకలో వున్న సామెతలకు అర్థాన్ని వివరించడమే కాదు. దానిని ఆధ్యాత్మికతకు అన్వయించడం చూస్తే ఎవరికైనా ఆశ్చర్యం కలిగించకమానదు. ఆయన ఏ సందేశం ఇచ్చినా ముందు ఒక ఉపమానాన్ని చెప్పి అర్థమయ్యేట్టు వివరించడం ఆయన ప్రత్యేకత.

అలాగే పత్రీజీ ఒక సందర్భంగా “తడిసి మోపెడు” అన్న సామెతకు అర్థాన్ని ఆధ్యాత్మికతకు అన్వయించి చెప్పడం జరిగింది.

ఏదైనా తడవకపోతే గుప్పెడే వుంటాయి. కానీ అవి తడిస్తే మోపెడవుతాయి. అంటే తడవకపోతే చేత్తో పట్టుకోగలిగిన వాటిని తడుపుకుంటే నెత్తితో మోయవలసివస్తుంది అని ఆయన అర్థం చెబుతూ... మనం తెచ్చుకునే కర్మలు గుప్పెడు వుంటాయి. కానీ మన అజ్ఞానంతో వాటిని తడుపుకుని అంటే పెంచుకుని మోపెడు చేసుకుని కష్టాలతో ఈ జీవితం వ్యర్థం అని భావిస్తుంటాం అని చెబుతూ..

అజ్ఞానాన్ని తొలగించుకుంటే కష్టాలు మోపెడు అవ్వవు. అలాగే కొంచెం ఓపిక పడితే ఆ కొద్దిపాటి గుప్పెడు కష్టాలు తేలికగా పోతాయి. కానీ ఎవరూ అజ్ఞానాన్ని  తొలగించుకునే ప్రయత్నం అంటే జ్ఞానాన్ని సంపాదించుకునే ప్రయత్నం చెయ్యడం లేదు. పైగా కష్టాలు రాగానే ఆ డాక్టరు.. ఈ డాక్టరు, ఆ దేవుడు... ఈ దేవుడు అని పరుగులు పెడుతున్నారు. అలా ఉన్న కష్టాలను అజ్ఞానంతో తడుపుకుని మోపెడు చేసుకుంటున్నారని వివరించారు.

ఆయన ఒక ఉదాహరణ కూడా ఇవ్వడం జరిగింది. దుర్యోధనుడు మయ సభలో భంగపడినపుడు ద్రౌపది నవ్వింది, అదే విషయాన్ని అక్కడితో వదిలేస్తే అంటే పట్టించుకోకపోతే గుప్పెడుతో పోయేది. కానీ ఆయన ఆ విషయాన్ని పదే పదే ఆలోచిస్తూ నాకు ఇంత అవమానమా, అంత అవమానమా అని తడుపుకుని చివరకు మోపెడంత చేసుకుని భారత యుద్ధాన్ని సృష్టించి అందరి వినాశనానికి కారకుడయ్యాడు అని పత్రీజీ వివరించారు.

పత్రీజీ సందేశం ఏమిటంటే ప్రతీ ఒక్కరూ ముందు అజ్ఞానం తొలగించుకోవాలి, జ్ఞానవంతులవ్వాలి. దానికి ముఖ్యంగా “శ్వాస మీద ధ్యాస” వుంచి ధ్యానం చెయ్యాలి,. జ్ఞానవంతమైన పుస్తకాలు చదవాలి. అలా చేసిన వారు జ్ఞానవంతులై తెచ్చుకున్న గుప్పెడు కష్టాలు తేలికగా అధిగమించడమే కాదు. ఈ కష్టాల నుంచి శాశ్వతంగా బయటపడగలుగుతారు, ఆనందంగా జీవించగలుగుతారు, శాశ్వత ఆనందాన్ని పొందగలుగుతారు.

# వైశ్వానరోపాసన

వైశ్వానరుడు అంటే విశ్వమందలి నరులందరిలో వ్యాపించి వున్నవాడు. అంటే 'ఆత్మ' అంటే 'భగవంతుడు' అని అర్థం. అలాగే ఉపాసన అంటే ఆరాధన అని తెలుసుకోవాలి.

'వైశ్వానరోపాసన' అంటే ఆత్మను ఆరాధించడం అంటే భగవంతుణ్ణి ఆరాధించడం.

ఈ సృష్టిలో ఎవరిని ఆరాధిస్తే దానికి తగ్గ ఫలితాలు లభిస్తాయి. ఈ సృష్టికి మూలము, ఈ సృష్టికి కారకుడు, సృష్టికి ఆధారము అయిన భగవంతుని ఆరాధిస్తే అన్ని రకాల ఫలితాలు లభిస్తాయి. కర్మలు దగ్ధమవుతాయి, ఆఖరికి ముక్తి కూడా లభిస్తుంది, పూర్ణజ్ఞానం లభిస్తుంది.

కానీ భగవంతుని నుంచి ఆవిర్భవించిన ఏ ఇతర దేవీ దేవతలను ఆరాధించినా కొన్ని పరిమిత లాభాలే లభిస్తాయని **చాందోగ్యోపనిషత్తులో** చెప్పబడింది. కారణం ఏ దైవతలైనా భగవంతునిలో భాగాలే కాబట్టి.

1) స్వర్గాన్ని ఉపాసిస్తే – వైశ్వానర (ఆత్మ) శిరోభాగాన్ని ఆరాధించినట్టు.
2) సూర్యుని ఉపాసిస్తే – వైశ్వానరుని నేత్రాలను ఆరాధించినట్టు.
3) వాయువును ఉపాసిస్తే – వైశ్వానరుని ప్రాణాన్ని ఆరాధించినట్టు.
4) ఆకాశాన్ని ఉపాసిస్తే – వైశ్వానరుని దేహమధ్య భాగాన్ని ఆరాధించినట్టు.
5) జలాన్ని ఉపాసిస్తే – వైశ్వానరుని మూత్రకోశాన్ని ఆరాధించినట్టు.
6) భూమిని ఉపాసిస్తే – వైశ్వానరుని పాదాలను ఆరాధించినట్టు అవుతుంది.

ఇవన్నీ 'ఆత్మ'ను అంటే 'భగవంతుని' పూర్తిగాఉపాసించినట్టు కాదు.

అందుచేత వాటి ఫలితాలు దానికి తగ్గట్టుగానే వుంటాయని చాందోగ్యోపనిషత్తులో చెప్పబడింది.

1) స్వర్గాన్ని ఉపాసించడం వల్ల మనుమలు, ముని మనుమలతో ధన,

ధాన్యాది ఇష్టవస్తువులను అనుభవించగలుగుతారు.

2) సూర్యుణ్ణి ఉపాసించడం వల్ల అన్ని రకాల సాధన సంపత్తి కలుగుతుంది. సమస్త ప్రియాలను అనుభవించగలరు.

3) వాయువును ఉపాసించడం వల్ల సంపదలు, ఆభరణములు లభిస్తాయి. అలా ఇష్ట విషయములను అనుభవించగలరు.

4) ఆకాశాన్ని ఉపాశించేవారు పుత్రులు, పౌత్రులు పొందడమే కాకుండా వారితో ఇష్ట విషయాలను అనుభవించగలరు. సుఖాన్ని పొందగలరు.

5) ఉదకాన్ని అంటే నీటిని ఉపాసించేవారు ధనపుష్టి, దేహ పుష్టి కలవారు అవుతున్నారు. ఇష్ట విషయాలను అనుభవిస్తారు.

6) భూమిని ఉపాసించే వారికి పుత్రపౌత్రాభివృద్ధి జరుగుతుంది. పశు సమృద్ధి కలుగుతుంది. అంతేకాకుండా అన్ని సమృద్ధి కలిగి ఇహ లోక విషయాలను అనుభవించగలుగుతారు. సంతుష్టిగా జీవించ గలుగుతారు. సంతోషంగా వుంటారు.

కానీ ఈ రకమైన ఆరాధనలు చేసే వారికి భోగభాగ్యాలు లభిస్తాయి. కానీ దుఃఖం నివారణ కాదు. కర్మలు రహితం కావు. ముక్తి రాదు. యాగాలు ద్వారా పై వారినెవరినైనా ఉపాసన చేసి వారి అనుగ్రహాన్ని పొందవచ్చు. తద్వారా సంపాదించిన పుణ్యంతో కొన్ని భోగభాగ్యాలు పొందవచ్చు. కానీ చేసిన పుణ్యం అనుభవించగానే మరల మామూలు దుఃఖమయమైన జీవితం లభిస్తుంది.

కానీ వైశ్వానరోపాసన అంటే ఆత్మను ఆరాధించడం వల్ల ఆనందం కలుగుతుంది. జ్ఞానం పెరుగుతున్నా జీవిత గమ్యం చేరుకుంటారు. జీవిత లక్ష్యం సాధిస్తారు.

'ఆత్మ'ను ఉపాసించే, ఆరాధించే మార్గమే 'ధ్యానం'. అందుచేత ధ్యానం ఎవరైతే చేస్తారో వారు జ్ఞానాన్ని పొందుతారు. చివరకు ముక్తిని కూడా పొందుతారు.



ఈ విషయమే 'యోగ వాశిష్ఠం' ద్వారా వశిష్ఠ మహర్షి శ్రీరామచంద్రునికి బోధించడం జరిగింది. దానినే బ్రహ్మర్షి పత్రీజీ వశిష్ఠామృతం ద్వారా తెలియ జేయడం జరిగింది.

Δ ఈ 'ఆత్మ'ను దర్శిస్తే సమస్త జగత్తునంతా దర్శించినట్లే. ఈ 'ఆత్మ' గురించి వింటే సమస్తమూ విన్నట్లే ఈ 'ఆత్మ'ను స్పృశిస్తే సమస్త జగత్తునూ స్పృశించినట్లే. ఈ 'ఆత్మ' వుంటే సమస్త జగత్తు వున్నట్లే అవుతుంది. (వశిష్ఠామృతం-66)

Δ 'ఆత్మ'ను పూజిస్తే అంటే 'ధ్యానం' చేస్తే 'స్వాత్మ' అనేది తక్షణమే 'బ్రహ్మానందం' అనే గొప్ప వరాన్ని ప్రసాదిస్తుంది. ఈ 'ఆత్మపూజతో' పోలిస్తే రుద్రుడు, శివుడు, ఇంద్రుడు మొదలైన వారి యొక్క పూజ శిధిల తృణం లాగే వ్యర్థమైనదిగా గోచరిస్తుంది. (వశిష్ఠామృతం-145)

Δ అంతరంగంలోని 'ఆత్మదేవుని' ధ్యానించడమే పూజ, ఇది తప్ప వేరొక పూజ లేదు. అందుచేత ముల్లోకాలకు ఆధార భూతుడైన ఆ పరమ 'ఆత్మ'ను 'ధ్యానం' ద్వారా నిత్యం పూజించాలి. (వశిష్ఠామృతం-104)

Δ దేవతలను ధ్యానించే వారు దేవతలనే పొందుతారు. యక్షులను ధ్యానించే వారు యక్షులనే పొందుతారు. బ్రహ్మాన్ని ధ్యానించేవారు బ్రహ్మాన్నే పొందుతారు. అందుచేత ఏది మహత్తరమైనదో దాన్ని పొంద ప్రయత్నించాలి. (వశిష్ఠామృతం-46)

Δ ఈ 'ఆత్మ' దూరాన లేదు. సమీపాన లేదు, అది అలభ్యం కూడా కాదు. దొరకని ప్రదేశంలోనూ లేదు. ప్రకాశమైన ఈ 'ఆత్మ' మానవునకు తన శరీరము నుంచే లభిస్తుంది. ఈ 'ఆత్మ' తపస్సు, స్నానాదికర్మల ద్వారా లభించదు. 'ధ్యానం'చేతనే లభిస్తుంది.

(వశిష్ఠామృతం-31)

# అన్నీ దైవ స్వరూపాలే

ఈ సృష్టిలో భగవంతుడు కానిది, భగవంతుడు లేనిది అంటూ ఏదీ లేదు అంటారు. కారణం అన్నీ దైవం నుంచే ఉద్భవించాయి కాబట్టి.

కానీ గమనిస్తే అన్ని జీవులు ఒకేలా వుండవు. వాటి రూపాలు వేరువేరుగా వుంటాయి, పేర్లు వేరుగా వుంటాయి, స్వభావాలు వేరుగా వుంటాయి, పనులు వేరుగా వుంటాయి, ప్రయోజనాలు వేరుగా వుంటాయి. చూస్తే ఒకదానికి, ఇంకొక దానికి సంబంధం కనిపించదు. ఆఖరుకు ఒకే జాతిలో కూడా ఒకరికి ఇంకొకరికి సంబంధం కనిపించదు. చాలా వ్యత్యాసాలు వుంటాయి. మానవులనే తీసుకుందాం. అంతా మానవులే అయినా మానవులలో స్త్రీలు, పురుషులు అన్న తేడా వుంటుంది. అలాగే స్త్రీలనే తీసుకుందాం. ఒకరికి ఇంకొకరికి ఎన్ని తేడాలో. ఒకరు పొడవుగా వుంటే–ఇంకొకరు పొట్టిగా, ఒకరు తెల్లగా వుంటే–ఇంకొకరు నల్లగా, ఒకరు లావుగా వుంటే–ఇంకొకరు సన్నగా, ఒకరిలో ఏ లోపం కనిపించదు–కానీ ఇంకొకరు అంగవైకల్యంతో వుంటారు. ఇలా రకరకాల వ్యత్యాసాలు వుంటాయి. ఆఖరికి గమనించగలిగితే కవలల్లో కూడా తేడాలు వుంటాయి. ఎక్కడ లేకపోయినా వేలిముద్రలలో, పుట్టు మచ్చలలో ఎక్కడో అక్కడ తేడా వుండి తీరుతుంది. ఇది సృష్టి యొక్క గొప్పతనం.

అలాగే కొందరు అందంగా, చూడముచ్చటగా వుండేవారు కొందరయితే, మరికొందరు అందవికారంగా, అసహ్యంగా వుండేవారు వున్నారు. కొందరు ధనంతో, అధికారంతో పెత్తనం చేస్తూంటే! మరికొందరు పేదరికంతో వూడిగం చేస్తూ అధికారం వున్నవారి చేత అవమానాలు పొందుతూ వుంటారు. కొందరు పంచేవారయితే, కొందరు దోచుకునేవారున్నారు. ఇలా గమనిస్తే అంతా దైవ స్వరూపాలైనా, దైవాలే అయినా రకరకాల ఆకారాలతో, స్వభావాలతో ప్రవర్తనలతో మనకి కనిపిస్తారు.

అలాగే జీవులలో కూడా కొన్ని ఉపకారం చేసేవి వుంటాయి–కొన్ని అపకారం చేసేవి వుంటాయి. కొన్ని సాధు స్వభావం కలిగి వుంటాయి–కొన్ని క్రూర స్వభావం కలిగి వుంటాయి. కొన్ని అందంగా చూడముచ్చటగా వుంటాయి–కొన్ని అసహ్యంగా, వికారంగా, భయం కలిగించే విధంగా వుంటాయి. కొన్ని జీవులు లోకానికి, అందరికి ఎన్నో రకాలుగా ఉపయోగపడతాయి, లాభాలు కలిగిస్తాయి. కానీ కొన్ని జీవులు ఎవరికి ఉపయోగపడవు సరికదా అపకారం

కూడా చేస్తూ వుంటాయి.

ఇలా సృష్టిలో గమనిస్తే అన్నీ భగవంతుడే అయినా, భగవంతుని రూపాలే అయినా ఇన్ని బేధాలు వుండడం వలన వాటి విషయంలో ఇతర జీవుల ప్రవర్తన వివిధ రకాలుగా వుంటుంది. అంటే ఏ జీవి ప్రవర్తన అయినా ఇతర జీవుల రూపాలను బట్టి, వాటి స్వభావాన్ని బట్టి వుంటుంది తప్ప అవి దైవ స్వరూపం అన్న భావంతో వుండదు.

మానవుల ప్రవర్తన కూడా, ఇతరుల, ఇతర జీవుల స్వభావాన్ని బట్టి, ప్రవర్తనను బట్టి వుంటుంది తప్ప అందరూ దైవమే, అన్ని జీవులు దైవ స్వరూపాలే అంతా ఒక్కటే అన్నట్టుగా వుండదు. కొంతమంది వూరికే అన్నీ దైవమే అని అంటారు కానీ వారి ప్రవర్తన చూస్తే అందరూ దైవమన్నట్టు వుండదు.

అందుచేత అందరూ దైవమే అన్నా ఎవరూ నమ్మరు. ఆ రకంగా వారిని చూడరు. వారి వారి తీరు దైవమన్నట్లుగా వుండదు. కారణం దైవమనగానే ప్రతి ఒక్కరిలో ఒక భావం నాటుకుపోతుంది. దైవమంటే గొప్పవాడు, మంచివాడు, రక్షకుడు, అందరికీ ఉపకారం చేస్తాడు, అందరినీ సమానంగా చూస్తాడు, అందరికీ మంచి చేస్తాడు. ఆయన శాంతమూర్తి, కరుణా స్వభావుడు, ప్రేమమూర్తి అందరినీ ప్రేమిస్తాడు. అందరితో సమానంగా వ్యవహరిస్తాడు అనేటువంటి భావం చోటు చేసుకుని వుంది. అందుచేత ఇక్కడ చూస్తే ఎవరి విషయంలోనూ, ఏ జీవి, ఏ ప్రాణి విషయంలో ఆ లక్షణాలు కనిపించవు. అందుచేత ఎవ్వరూ ఎవరినీ దైవమని భావించరు. ఒకవేళ కొంతమంది భావించినా ప్రవర్తన ఆ రకంగా కనిపించదు.

మరి ఎందుకు అందరూ, అన్నీ దైవమే అయినా ఎందుకు ఇన్ని తేడాలు, ఇన్ని భేదాలు? ఇన్ని వ్యత్యాసాలు? ఆలోచిస్తే అంతా గందరగోళమే. ఎందుచేతనంటే అన్నీ దైవమే అని చెప్పడానికి ఎన్నో ఉదాహరణలు పెద్దలు, పండితులు చెపుతూ వుంటారు.

అలా కుండలు వేరైనా! అంటే వాటి రూపాలు, పేర్లు ప్రయోజనాలు వేరైనా! అన్నీ మట్టి నుంచేగా వచ్చింది. అలాగే ప్రపంచంలోని జీవులు అన్నీ భగవంతుని నుంచే వచ్చాయి అని చెపితే వినటానికి కరెక్టే అనిపిస్తుంది, కానీ ఆచరించేటపుడు మాత్రం ఈ ఉపమానం గుర్తుకు రాదు, ప్రవర్తన ఆ రకంఒగా వుండదు. మరి బోధించే పండితుల ప్రవర్తన చూసినా ఆ రకంగా వుండదు. వినే వారందరి కంటే తామే గొప్పవారన్నట్టుగా ప్రవర్తిస్తారు. అందరిచేత

పాదాలకు నమస్కారాలు పెట్టించుకుంటారు. ఆలోచిస్తే ఇదే ఆశ్చర్యం గొలిపే విషయం. కారణం వారు కూడా దైవమైనప్పుడు, తనతో సమానమైనపుడు ఎలా నమస్కారాలు పెట్టించుకుంటారు? వారు తన లాంటి వారే కదా?

అలా పండితులు, పెద్దలు ఎన్ని ఉపమానాలు చెప్పినా, ఈ విషయంలో జనంలో కొన్ని సందేహాలు వున్నాయి. మరి అంతా దేవుళ్ళయితే వారి ప్రవర్తన అలా ఎందుకు వుంటుంది? వారు ఎందుకు స్వార్థం ప్రదర్శిస్తున్నారు? తప్పులు ఎందుకు చేస్తున్నారు? ఎందుకు ఈ పశు ప్రవర్తన? ఈ మోసాలు ఏమిటి? ఈ దోపిడీలు, హత్యలు ఏమిటి? ఈ మానభంగాలు ఏమిటి? అని ప్రశ్నిస్తారు. అంతేకాదు వారి విషయంలోనే వారికి సందేహం వుంటుంది. మరి నేను దేవుడయితే నాకు మహత్యాలు లేవేమిటి? నేను అనుకున్నది ఎందుకు అవటం లేదు? నా ప్రవర్తన ఇలా ఎందుకు వుంది? నాకు ఏ శక్తులు లేవేమిటి? అని ప్రశ్నించుకునేవారు, ప్రశ్నించేవారు కూడా వున్నారు.

అలా అంటూనే దేవుళ్ళుగా భావిస్తూ, కొన్ని చెట్లకు మొక్కుతారు, పూజిస్తారు, నదులను పూజిస్తారు, రాళ్ళను పూజిస్తారు, కొన్ని పక్షులను, జంతువులను పూజిస్తారు. అలా ఆవులను పూజించడం, పాములను పూజించడం మనం చూస్తూనే వున్నాం. అంతేకాదు కొంతమంది మానవులను పూజించడం కూడా మనం చూస్తూనే వున్నాం. ఆలోచిస్తే ఇది కూడా మనకు ఆశ్చర్యం కలిగిస్తుంది. మరి చెట్లు దేవుడు కానప్పుడు చెట్లను ఎందుకు పూజిస్తున్నారు? జంతువులు దేవుడు కానప్పుడు కొన్ని జంతువులను ఎందుకు పూజిస్తున్నారు? అలాగే మానవులు దేవుడు కానప్పుడు కొంతమంది మానవులను ఎందుకు పూజిస్తున్నారు?

ఇలా అడిగితే ఏమంటారంటే? అవి మనకు, లోకానికి ఎంతో ఉ పకారం చేస్తున్నాయి, లాభాలు కలిగిస్తున్నాయి. వాటి వల్ల మానవులు ఎన్నో లాభాలు పొందుతున్నారు. అవి ఎన్నో విశిష్ఠ గుణాలు కలిగి వున్నాయని చెపుతారు. అందుకే చెట్లను, నదులను పూజిస్తున్నాం, ఆవులను పూజిస్తున్నాం. కొంతమంది గురువులను కూడా పూజిస్తున్నాం అని చెపుతారు.

దీనిని బట్టి వేటికైతే విశిష్ఠ గుణాలు వుంటాయో! అందరికీ ఉపకారం చేస్తాయో! అందరికీ వాటి వల్ల ప్రయోజనం కలుగుతూ వుంటుందో! అలాంటి వాటిని మాత్రమే దైవంగా భావిస్తారు. అంటే అన్నీ జంతువులే అయినా వాటి గుణాల్ని బట్టి, అవి అందరికీ కలిగించే లాభాలను బట్టి దైవం అంటున్నారు.

అలాగే అందరూ మానవులైనా వారి ప్రవర్తనను బట్టి, వారు చేసే లోకోపకారమైన పనులను బట్టి వారిని దైవమని భావిస్తున్నారు.

అంటే ఇక్కడ జాతిని బట్టి దైవం అనటం లేదు. ప్రవర్తనను బట్టి మాత్రమే దైవం అంటున్నారు. అంటే జాతిని బట్టి చూస్తే అన్నీ దైవాలే కానీ ప్రవర్తన అలా లేదు కాబట్టి ఎవరూ దైవమని అనుకోవటం లేదు. అంతేకాదు అదే జాతికి చెందినా, ప్రవర్తన మారిపోతే మరల దానిని దైవమని అంటారు. పూజిస్తారు. చూడండి ఒక పంది గుడి చుట్టూ ప్రదక్షణాలు చేస్తే దానిని దైవమని పూజిస్తారు. అలాగే ఒక కోతి గుడిలో కూర్చుంటే అది ఆంజనేయస్వామి అని పూజిస్తారు. అలాగే ఒక పాము గుడిలో విగ్రహానికి చుట్టుకుంటే అది దైవమని పూజిస్తారు.

దీనిని బట్టి అన్నీ భగవంతుడే. అందరూ భగవత్ స్వరూపాలే. అయినా ప్రవర్తన మారకపోతే దైవం కాదు, ప్రవర్తన మారితే దైవం అంటారు. దీనంతటికీ కారణం అజ్ఞానం. కానీ జ్ఞాన దృష్టితో చూస్తే అందరూ దైవాలే. ఇది సత్యం. అందుచేత ప్రవర్తన సరిగా లేదని. వాటి పట్ల మరో విధంగా ప్రవర్తిస్తే నష్టపోయేది మనమే. అందుచేత ఈ సృష్టి రహస్యాన్ని అంటే అన్నీ భగవత్ స్వరూపాలే, **"సర్వం ఖల్విదం బ్రహ్మ"** అన్న రహస్యాన్ని తెలుసుకుని వేటి పట్ల ఎలా ప్రవర్తించాలో తెలుసుకుని జీవించాలి. అలా జీవించిన జీవితమే సరైన జీవితం, సృష్టికి అనుగుణంగా జీవించిన జీవితం అవుతుంది. అలాంటి వారి జీవితం ఎప్పుడూ ఆనందదాయకంగా వుంటుంది. చివరకు వారే దైవ స్వరూపాలవుతారు. అంటే వారి ప్రవర్తన అలా మారిపోతుంది.

ఈ విధంగా చెప్పగానే మనకు మరల మరొక సందేహం రావచ్చు. మరి అంతా దేవుళ్ళయితే నేను నా పనిమనిషితో పని చేయించుకోవచ్చా? నా దగ్గర పని చేసే జవానుకు నా ప్రక్కనే సీటు వెయ్యాలా? అంతా దేవుళ్ళయితే నా భార్యతో కాపురం చెయ్యాలా? వద్దా? లాంటి సందేహాలు వ్యక్తం చేస్తారు. నాకు అన్యాయం చేసిన వారి పట్ల ఎలా ప్రవర్తించాలి? నన్ను మోసగిస్తే ఏం చేయాలి? నన్ను దూషిస్తే ఏం చెయ్యాలి? నన్ను బాధిస్తే ఏం చెయ్యాలి? అందరూ దేవుళ్ళయినప్పుడు వారి పట్ల ఎలా ప్రవర్తించాలి? అన్న సందేహం సహజంగానే వస్తుంది.

అటువంటి వారికి బ్రహ్మర్షి వశిష్టులు వారు తన అద్భుతమైన గ్రంథం యోగ వాశిష్టం ద్వారా ఈ విధంగా చెప్పడం జరిగింది.

**శ్లో॥ భావాద్వైత ముపాశ్రిత్య సత్యాద్వైత మయాత్మకః**
**కర్మాద్వైతి మనాత్తత్యత్రైతాద్వైతి మయాధన**

తా॥ కేవలం భావంలో అద్వైతాన్ని ఆశ్రయించి, కర్మలలో ద్వైత్యాన్ని ఆశ్రయించాలన్నారు.

అంటే కర్మలలో వేరు అన్నట్టుగా చేస్తూ భావంలో మాత్రం వారు నేను, అది నేను ఒక్కటే అన్నట్టుగా వ్యవహరించాలి.

ఈ సృష్టిలో చూడటానికి రకరకాల రూపాలు కనిపిస్తాయి. వాటికి రకరకాల పేర్లు వుంటాయి. రకరకాల పనులు చేస్తుంటాయి. రకరకాల ప్రయోజనాలు కలిగి వుంటాయి. కానీ అన్నీ ఒకే చైతన్యం నుంచి సృష్టింపబడినవే.

ఉదాహరణకు బంగారం వస్తువులు రకరకాల ఆకారాలు కలిగి వుంటాయి. వాటికి రకరకాల పేర్లు కూడా వుంటాయి. అలానే వాటి ప్రయోజనాలు కూడా వేరువేరుగానే వుంటాయి. కానీ అన్నీ ఒకే బంగారం నుంచి తయారయినవే, అందుచేత అవి పెద్దవైనా, చిన్నవైనా అన్నిటిని బంగారంగానే చూస్తాం. బంగారం వస్తువులనే భావిస్తాం.

ఉపయోగించేటప్పుడు వేరు వేరు పనులకు వుపయోగించినా అన్నీ ఒక్కటే అనే భావం వల్ల అన్నిటిని ఒకే పెట్టెలో భద్రపరుస్తాం. ఇక్కడ గమనిస్తే వాడుకునేటప్పుడు అవి వేరు వేరు అన్నట్టుగా వ్యవహరిస్తాం. కానీ భావం మట్టుకు అన్నీ బంగారమే అని అనుకుంటాం.

అలాగే జీవుల విషయంలోనే కాదు, ఇతరుల విషయంలో కూడా అలాగే వ్యవహరించాలి. కారణం అన్నీ ఒకే చైతన్యం నుంచి ఉద్భవించినవే కాబట్టి.

పనివాడితో పని చేయించుకోవచ్చు. కానీ వాడు నేను ఒక్కటే అని మర్చిపోకూడదు. ఆ భావంతో వాడిని కూడా నీతో సమానంగా చూడాలి. వాడిని అవమానించకూడదు, అధికారం వుందని బాధించకూడదు, దౌర్జన్యం చెయ్యకూడదు. తినే దాంట్లో ఉన్న దాంట్లో కొంత పెట్టాలి. పాసిపోయింది, పాడైపోయింది. పనికి రానిది పెట్టకూడదు. వాడి ఎదురుగా తింటూ కనీసం ఏమీ పెట్టకుండా వుండకూడదు, వాడికి కూడా కొంత పెట్టాలి.

అలాగే భార్యతో కాపురం చెయ్యవచ్చు. సంసార సుఖం అనుభవించ వచ్చు. కానీ ఆమె కూడా నీలాంటి చైతన్య స్వరూపమే అన్న విషయం మరిచి పోకూడదు. ఒక్కటే అన్న భావంతో గౌరవించాలి, ప్రేమగా వ్యవహరించాలి, అవమానించకూడదు, తక్కువగా చూడకూడదు, హింసించకూడదు. నీలాంటి

బాధే ఆమెకు కూడా వుంటుందని తెలుసుకోవాలి. అలా వ్యవహారంలో భార్య కాని భావంలో మాత్రం ఒక్కటే అన్నది మర్చిపోకూడదు.

అలాగే జంతువులను ఉపయోగించుకోవచ్చు. ఎద్దుతో పని చేయించుకోవచ్చు. గుర్రాన్ని ఉపయోగించుకోవచ్చు. కానీ అవి కూడా తనలాంటి చైతన్య స్వరూపాలేనని మర్చిపోకూడదు. వాటి ఆలనాపాలనా చూడాలి. ఏ సమయానికి వాటికి ఏమి కావాలో అవి ఇవ్వాలి. ఆహారం, నీరుతో పాటు వాటికి కావలసిన విశ్రాంతి ఇవ్వాలి, వాటిని ప్రేమగా చూడాలి. వాటిని కొట్టకూడదు, హింసించకూడదు, వాటి అవసరాలు తీర్చాలి. అవసరాలకు ఉ పయోగించుకోవాలి. అంతేకానీ వాటిని బాధించకూడదు. వినోదం కోసం, సరదా కోసం వాటి మధ్య పోటీలు పెట్టి హింసకు గురి చెయ్యకూడదు.

మన కష్టం లాంటిదే వాటి కష్టం అని తెలుసుకోవాలి. భావించాలి. మన బాధ లాంటిదే వాటి బాధ అని తెలుసుకోవాలి. గాయమైతే నీకు ఎంత బాధో వాటికి గాయమైనా అంతే బాధ వుంటుందని తెలుసుకోవాలి. మనం వైద్యం చేయించుకున్నట్టే... వాటికి కూడా వైద్య సహాయం అందించాలి. గాయం అయితే ఎలా విశ్రాంతి తీసుకుంటామో వాటికి కూడా విశ్రాంతి ఇవ్వాలి.

ఇదే వశిష్ఠ మహర్షి బోధించిన బోధలోని సారాంశం. "కర్మలలో ద్వైతం... భావంలో అద్వైతం" అంటే బాహ్యంలో వేరు అన్నట్టుగా భావంలో మాత్రం 'ఒక్కటే' అన్నట్టుగా వ్యవహరించాలి అంటే నేనే అన్నది మర్చిపోకూడదు.

యోగులు ఈ సత్యాన్ని బోధిస్తున్నా లోకంలో ఎందుకు అలా ప్రవర్తిస్తున్నారంటే? కారణం అజ్ఞానం. కానీ ధ్యానం ద్వారా అజ్ఞానాన్ని తొలగించుకుని జ్ఞానాన్ని పొందితే మానవుని ప్రవర్తన పూర్తిగా మారిపోతుంది. జైన మతంలో బోధించింది అర్థం చేసుకుంటాడు. జైనం ఏమందంటే?

"నువ్వు ఎవరినో కొట్టాననుకుంటున్నావు కానీ కొట్టించుకున్నది నువ్వే"

"నువ్వు ఎవరినో హింసించాననుకుంటున్నావు కానీ హింసకు గురి అయ్యింది నువ్వే"

"నువ్వు ఎవరినో పాదాక్రాంతుల్ని చేసుకోవాలనుకుంటున్నావు కానీ పాదాక్రాంతమయ్యేది నువ్వే".

"నువ్వు ఎవరినో శాశించాననుకుంటున్నావు కానీ ఆ శాసనానికి తలవంచింది నువ్వే".

అందుకే జ్ఞాని ఎవరినీ హింసించడు, హింసకు కారణం కాడు, శాసించడు, బాధించడు. మరి అటువంటి జ్ఞానం ఒక్క 'ధ్యానం' వల్ల మాత్రమే వస్తుంది.

# ఆధ్యాత్మికత

'ఆత్మ' సంబంధమైనదే ఆధ్యాత్మికత. 'ఆత్మ' అంటే దైవం కాబట్టి దైవ సంబంధమైనదే ఆధ్యాత్మికత. అలాగే దేహ సంబంధమైన దానిని ప్రాపంచికత అంటాం.

ఆధ్యాత్మికంగా ఎదగడం అంటే 'ఆత్మ' పరంగా ఎదగడం. అంటే 'ఆత్మ స్థితి' పొందుతూ వుండటం. అంటే 'దైవ స్థితి' పొందుతూ వుండటం అంటే దైవంలా ప్రవర్తించ గలగడం. దైవ శక్తులు పొందగలగడం, దైవంగా మారడం.

సహజంగా మానవుడు మనో స్థితిలో వుంటాడు. అంటే మనస్సు యొక్క ప్రాముఖ్యం ఎక్కువ వుంటుంది. అందుచేత మనస్సును బట్టి ప్రవర్తిస్తాడు. కానీ ఆత్మ స్థితి కలిగే కొద్దీ మనస్సు యొక్క ప్రాముఖ్యం తగ్గుతూ వుంటుంది. ఆత్మ ప్రాముఖ్యం పెరుగుతూ వుంటుంది. దీనినే ఆధ్యాత్మికంగా ఎదగడం అంటాం.

ఒక రకంగా చెప్పాలంటే 'మనస్సు' అంటే మానవుడు, 'ఆత్మ' అంటే దేవుడు. మనస్సు యొక్క ప్రాముఖ్యం ఎక్కువ వున్నవారు మానవుడిలాగ ప్రవర్తిస్తారు. 'ఆత్మ' ప్రాముఖ్యం ఎక్కువ వున్నవారు అంటే ఆధ్యాత్మికంగా ఎదిగిన వారు దైవంలా ప్రవర్తిస్తారు.

ఆధ్యాత్మిక ఎదుగుదల లేనివారు మానవ లక్షణాలతో జీవిస్తారు. అలాంటి వారు మూడు రకాల లక్షణాలతో జీవిస్తూ వుంటారు, ప్రవర్తిస్తూ వుంటారు. (1) తమోగుణ లక్షణాలు, (2) రజో గుణ లక్షణాలు, (3) సాత్విక గుణ లక్షణాలు.

ఆధ్యాత్మిక ఎదుగుదల వున్నవారు, ఆత్మస్థితి పెరుగుతున్నవారు మెల్లి మెల్లిగా తమ గుణాలను మార్చుకుంటూ తద్వారా ప్రవర్తన మార్చుకుంటూ.. చివరకు నిర్గుణ స్థితికి చేరుకుంటారు. అంటే దైవ స్థితికి చేరుకుంటారు.

ఒకరకంగా ఆధ్యాత్మికంగా ఎదగడమంటే 'మానవుడు–మాధవుడుగా' మారడం. 'మానవ లక్షణాలు తొలగించుకుని–దైవ లక్షణాలు సంతరించుకోవడం'. ఇదే ఆధ్యాత్మికంగా ఎదగడమంటే, ఇదే ఆధ్యాత్మికత

యొక్క అర్థం. అంతేకానీ ఆధ్యాత్మికత అంటే చిడతలు పట్టి భజనలు చేయడం కాదు. బొమ్మలు పెట్టి పూజించడం కాదు.

ఆధ్యాత్మికత అంటే దైవాన్ని పూజించడం కాదు. దైవంగా మార్పు చెందడం. దానికి సాధనే మార్గం అంటే 'ధ్యానం' ఒక్కటే మార్గం. కారణం ధ్యానం ద్వారా నెమ్మది, నెమ్మదిగా అంతర్యామిగా, అంతరంలో వున్న 'ఆత్మ'కు దగ్గర అవుతూ వుంటారు. 'ఆత్మ' అంటే దైవం కాబట్టి దైవానికి దగ్గరయ్యే కొద్దీ దైవ లక్షణాలు పొందుతూ వుంటారు. దైవశక్తులు సంతరించుకుంటూ వుంటారు. అలా ధ్యానం చేస్తున్న వారికి నెమ్మదిగా వారిలోని మానవ గుణాలు మారుతూ వుంటాయి. తమోగుణంలో వున్న వారు రజోగుణంలోకి వస్తారు. రజోగుణంలో వున్నవారు సాత్విక గుణంలోకి వస్తారు. చివరకు సాత్విక గుణంలో వున్నవారు నిర్గుణంలోకి వస్తారు. దైవంలా మారిపోతారు.

అలా విశేషమైన ధ్యాన సాధన ద్వారా మార్పు చెందిన ఎంతోమంది మానవులు దేవుళ్ళు అవ్వడం వారిని దేవుళ్ళు అని లోకంలో సామాన్యులు పిలవడం మనం చూస్తూనే వున్నాం. ఉదాహరణకు బుద్ధుడు రాజకుమారుడుగా వున్నప్పుడు భగవానుడు అని ఎవరూ అనలేదు. కానీ విశేషమైన ధ్యాన సాధన చేసి పరివర్తన చెందిన తరువాత మాత్రమే ఆయనను బుద్ధభగవానుడు అని అనడం జరిగింది.

అలాగే రమణ మహర్షి, రామకృష్ణపరమహంస, వివేకానంద, వీరబ్రహ్మేంద్రస్వామి, షిరిడీ సాయిబాబా, సత్యసాయిబాబా, అవతార్ మెహర్‌బాబా, యోగి వేమన లాంటి వారెందరినో పుట్టగానే దేవుళ్ళు అని అప్పటి వారు అనలేదు. తరువాత ధ్యాన సాధన ద్వారా సమాధి స్థితి పొంది, అపారమైన జ్ఞానం పొంది, దైవశక్తులు సంపాదించుకుని మానవాతీతమైన పనులు చేస్తుంటే! అపుడు మాత్రమే వారిని దేవుళ్ళుగా గుర్తించడం జరిగింది. వారిని భగవాన్ అని పిలవడం, కొలవడం లోకంలో చూస్తూనే వున్నాం. అలా శ్రీకృష్ణుడు, జీసస్, మహమ్మద్, మహావీరుడు, గురునానక్, కబీర్‌దాస్ లాంటి వారెందరినో యుగయుగాలుగా చూస్తున్నాం.

అలా ఒక మానవుడు ధ్యాన సాధన ద్వారా మాధవుడుగా మార్పు చెందడమే నిజమైన ఆధ్యాత్మికత.

అంతే కాదు తనలోని, ప్రతి ఒక్కరిలోని దివ్యత్వాన్ని తెలుసుకోవడమే ఆధ్యాత్మికత. అలాగే ప్రతి ఒక్కరిలోని దివ్యత్వాన్ని తెలియచేయడమే ఆధ్యాత్మిక బోధ.

ఆత్మ స్థితిలో వున్న వారు తప్పులు చెయ్యరు. కానీ దేహస్థితిలో వున్నవారు తప్పులు చేయకూడదనుకున్నా చేసేస్తూ వుంటారు. అలా ఆధ్యాత్మికంగా ఎదగనంత కాలం ఈ మతాచారాలు, కులాచారాలు, కట్టుబాట్లు మానవుడిని తప్పులు చేయకుండా ఆపలేవు. మానవులు దుఃఖం లేకుండా జీవించలేరు.

ఈ ఆధ్యాత్మిక ఎదుగుదల అన్నది ఒక్క ధ్యానం ద్వారా మాత్రమే సాధ్యం. అందుచేత ధ్యానం చెయ్యండి. ఆధ్యాత్మికంగా ఎదగండి. దైవంలా మారండి.

## మానవాళికి ఆధ్యాత్మికత ఎందుకు బోధించాలి?

మానవాళి దుఃఖం నుంచి, కర్మచక్రం నుంచి బయటపడాలన్నా, మానవాళి ఆనందంగా జీవించాలన్నా! ఆధ్యాత్మికతే ఏకైక మార్గం.

కారణం ఎన్ని జన్మలు ఎత్తినా మానవుడు ఈ ప్రాపంచిక విషయాల పట్ల, సుఖాల పట్ల ఆసక్తి కనపరుస్తూ వుంటాడు. సుఖాలతో పాటు వచ్చే దుఃఖాలతో విసుగెత్తి చివరకు ఇటువంటి జీవితం నుంచి బయటపడాలని తపనపడుతూ వుంటాడు.

అటువంటి వారికి మార్గం చూపించవలసిన భాధ్యత దుఃఖం నుంచి బయటపడిన వారికి వుంటుంది. కారణం దారి తెలిసిన వారే దారి చూపించగలరు. అందుచేత బయటపడిన వారు బయటపడాలనుకునే వారికి తప్పనిసరిగా మార్గం చూపించాలి. అది వారి ధర్మం. సృష్టిలోని ఏర్పాటు.

ఈ సృష్టి నియమం ప్రకారం బయటపడిన వారు, బయటపడే మార్గాన్ని మరికొంతమందికి చూపిస్తే కానీ వారు కూడా పూర్తిగా బయటపడలేరు. అందుకే అటువంటి వారు ఆ మార్గాన్ని అందరికీ బోధిస్తారు.

దీనినే "తీర్థంకరగోత్ర బంధం" అని పత్రీజీ చెప్పడం జరిగింది. అందుకే ఆయన అందరినీ ధ్యానం చెయ్యమంటారు. జ్ఞానం సంపాదించుకోమంటారు. సంపాదించుకున్న జ్ఞానాన్ని అందరికీ బోధించమంటారు. ఆధ్యాత్మికంగా పరిపూర్ణ స్థితికి ఎదగాలనుకునే వారికి ఆధ్యాత్మికత బోధించడం తప్పనిసరి.

# సాయం చెయ్యాలా?

చాలా మంది అడుగుతూ వుంటారు. నేను బాధలలో వున్నవారికి, సాయం అర్థించిన వారికి, కష్టాలలో వున్న వారికి సాయం చేయవచ్చా? వారిని ఆదుకోవచ్చా?

కానీ ఆలోచిస్తే అంత జాలి గుండె వున్నవారు కోడి పట్ల, మేక పట్ల, మూగ జీవుల పట్ల ఎందుకు జాలి చూపించరు? అలా చూపించట్లేదంటే వారికి నిజంగా జాలి లేదనేగా? వూరికే అలా అడుగుతారు కానీ, అడిగే వారు అన్నిటి పట్ల, అన్ని జీవుల పట్ల జాలి చూపించాలి కదా?

అంతెందుకు అసలు తమ జీవితం బాగుందా? తమకి ఎవరి సాయం అవసరం లేదా? తానే పై వాడి సాయం రోజూ అర్థిస్తున్నారే? తానే ఆపదలలో వున్నానని మొరపెట్టుకుంటున్నారే? ఆపదలలో వున్న తాను, సాయం కోరుతున్న తాను, ఇతరులకు సాయం ఎలా చెయ్యగలరు?

తెలుసుకోండి ఎవరైనా సరే ముందు తనను తాను ఉద్ధరించుకోవాలి. తరువాతే లోకానికి సాయం గురించి ఆలోచించాలి. రామకృష్ణ మిషన్ వారు చెపుతారు "ఆత్మనో మోక్షాయచ! జగత్ హితాయచ!" అంటే "ముందు ఆత్మకు మోక్షం అంటే తన ఉద్ధరణ... తరువాతే జగత్ హితం. అంటే లోకానికి ఉపకారం". తనకు మోక్షం లేకుండా జగత్తుకు ఉపకారం ఎలా చేస్తారు?

అందుచేత ముందు 'ధ్యానం' చెయ్యండి. ధ్యానం ఎందుకంటే 'జ్ఞానం' కోసం. 'జ్ఞానం' ఎందుకంటే 'ముక్తి' కోసం. పత్రీజీ ఇదే చెపుతూ వుంటారు. "ధ్యానం వల్లనే జ్ఞానం, జ్ఞానం వల్లనే ముక్తి".

తెలుసుకోండి ముందు మీరు ముక్తులవుతేనే ఇతరుల ముక్తికి తోడ్పడగలరు. దారి చూపించగలరు. సాయం చెయ్యగలరు. అందుచేత ముందు ధ్యానం చెయ్యండి.

# మనస్సు కోతిలాంటిది

మనస్సుకు కోతిలాంటి చంచల స్వభావం వుంటుంది. స్థిరంగా వుండదు. ఇపుడు ఒకటి ఆలోచిస్తే... మరుక్షణం మరొకటి ఆలోచిస్తుంది. ఈ రోజు ఇస్తానంటుంది ... మర్నాడు నేనెక్కడ అన్నాను? అంటుంది. ఇపుడు చేస్తానంటుంది... మరుక్షణం చెయ్యనంటుంది. మాట మీద నిలబడదు. అన్నమాట ఆచరించదు. అచ్చం కోతిలాగే వ్యవహరిస్తుంది.

అలాంటి స్థిరం లేని, చంచల స్వభావం కలిగిన కోతికి పిచ్చి పట్టడమే కాదు. ఒకసారి అది సారా త్రాగింది. అపుడు దాని పరిస్థితి ఎలా వుంటుందో వూహించండి. దానికి తోడు దానికి ముల్లు కూడా గుచ్చుకుంది. ఆ సమయంలోనే దానికి తేలుకుట్టింది. ఆపైన ఒక దెయ్యం ఆవహించింది. అలాంటి కోతి ఎలా ప్రవర్తిస్తుందో వూహించండి. దానిని ఎవరైనా అదుపు చెయ్యగలరా? సాధ్యమా? అలాంటి కోతి ఎంత భీభత్సం సృష్టిస్తుంది? ఎంత నష్టం కలిగిస్తుంది? వూహించండి? అంతా నష్టమే కదా? అలాంటి కోతితో మానవుని మనస్సును పోలుస్తారు.

అలాగే అంతులేని ఆలోచనలతో పిచ్చి పట్టిన కోతిలా వ్యవహరించే మనస్సుకు కష్టాలనే ముల్లు గుచ్చుకుంది, దానికి తోడు కోరికలనే సారా త్రాగింది. తరువాత ఆ మనస్సుకు ఈర్ష్య అనే తేలుకుట్టింది. అది చాలదన్నట్టు అహంకారమనే దయ్యం ఆవహించింది. అటువంటి మనస్సున్న మానవుని ప్రవర్తన ఎలా వుంటుంది? అటువంటి ప్రవర్తన వున్న మానవుని జీవితం ఎలా వుంటుందో? వూహించండి. అంతా అస్తవ్యస్తమే! అశాంతే! చివరకు దుఃఖమే! అంతేకాదు అటువంటి మనస్సును నియంత్రించడం ఎంత కష్టమో ఆలోచించండి.

కానీ అలాంటి మనస్సును “శ్వాస మీద ధ్యాస” అనే ధ్యానంతో తేలికగా నియంత్రించవచ్చు, అదుపు చేయవచ్చు, మన స్వాధీనంలో వుంచుకోవచ్చు, శాంత పరచవచ్చు. అలా చేసిన వారు ఒక రకంగా మనస్సును జయించినవారవుతారు. అలా ఎవరైతే “శ్వాస మీద ధ్యాస ధ్యానంతో” మనస్సును శాంత పరచుకుంటారో, జయిస్తారో! వారికి జీవితంలో అన్నీ లాభాలే. అంతా ఆనందమే.

అందుచేత కోతి లాంటి మనస్సును ధ్యానం ద్వారా అదుపు చేయండి.

# ఎరుక

ఈగలు, దోమలు, కీటకాలు, జంతువులు పూర్తి ఎరుకతో వుంటాయి. ఏ మాత్రం ప్రమాదం సంభవించినా, ఎంత వేగంగా ప్రమాదం ముంచుకొచ్చినా తప్పించుకోగలవు. ఆహారాన్ని ఆస్వాదిస్తూనే మరొక ప్రక్క పూర్తి ఎరుకతో వుంటాయి. ఏ మాత్రం అలికిడి అయినా వెంటనే పారిపోతాయి. కారణం ఎరుక.

కానీ మానవుడు మనస్సు వల్ల ఎరుక కోల్పోతున్నాడు. ప్రమాదం మీద పడినా తెలియదు. మొద్దులా అలాగే వుండిపోతాడు. కదలడు. కారణం ఎరుక లేకపోవడం. చూడండి ఆలోచిస్తున్న వ్యక్తిని, ప్రక్కవాడితో మాట్లాడుతున్న వ్యక్తిని ఎన్ని సార్లు పిలిచినా పట్టించుకోడు. ఒక పనిలో వున్నవాడికి ప్రక్కన ఏం జరుగుతుందో కూడా తెలియదు.

మరి జంతువులకు వున్న ఎరుక మానవులకు ఎందుకు లేదు? అంటే మానవులకు కూడా ఎరుక వుంది. కానీ మనస్సు మలినంగా తయారవడం వల్ల ఎరుక కోల్పోవడం జరిగింది. అటువంటి ఎరుకలో మానవుడు జీవించాలంటే పత్రీజీ ఈ విధంగా చెప్పారు.

సాత్వికమైన శాకాహారం తీసుకుంటూ విశేషంగా అనునిత్యం ధ్యానం చెయ్యాలి. అలా చేస్తూంటే కొన్నాళ్ళకు మనస్సు శుద్ధమవుతుంది. తరువాత కొన్ని సంవత్సరాలకు మనస్సు శూన్యమవుతుంది. తద్వారా దివ్య జ్ఞానం కలుగుతుంది. తద్వారా మానవునకు ఎరుక కలుగుతుంది. ఎరుకలో జీవించగలుగుతారు.

ఉదాహరణకు "బ్రూస్‌లీ" సినిమాలు కానీ "జాకీచాన్" సినిమాలు కానీ చూడండి వాళ్ళు కొంతమందితో యుద్ధం చేస్తుంటారు. ఈ లోపులో వెనుకనుంచి ఎవరైనా వస్తే వెనక్కి చూడకుండా, తిరగకుండా శత్రువు రాకను గమనించి స్పందిస్తారు. ఎరుక వున్నవారే అలా స్పందించగలరు. ఈ ఎరుక అన్నది బాహ్య శత్రువుల నుండి రక్షించుకోవడానికే కాదు. మానవుడు తాను చేసే తప్పుల నుంచి, తప్పుడు మాటల నుంచి రక్షించుకోవడానికి చాలా అవసరం.

మానవునకు ఎరుక వుంటే ఆ పని చేయకముందే, ఆ మాట మాట్లాడటానికి ముందే తెలుసుకుంటారు. అవి దోషయుక్తమైతే, వాటిని సరిచేసుకుంటాడు, లేకపోతే చేయడం మానేస్తాడు. అది ఎరుక వున్న వారికే సాధ్యమవుతుంది. ఎరుక లేకపోతే పొరపాటు జరిగిన తరువాత తెలుసుకుని అరే! తప్పు చేసానే, అబద్ధం చెప్పానే అని నాలిక కరుచుకున్నా ప్రయోజనం వుండదు. జరగబోయే నష్టమంతా జరిగినట్టే. ఈ సృష్టిలో చేసింది, మాట్లాడింది వెనక్కి తీసుకోవటానికి అవకాశం లేదు. కారణం కర్మ వారి ఖాతాల్లో రికార్డయిపోతుంది. ఫలితం అనుభవించడమే తరువాయి.

ఉదాహరణకు ఎవరైనా మీటింగుకు ఎంతమంది వచ్చారు? వారు 100 మంది వచ్చినా గొప్పకోసం 200 మంది వచ్చారని అన్నారనుకోండి. అలా అనే ముందే ఎరుక వున్న వారికి నువ్వు తప్పు చెపుతున్నావు. అబద్ధం చెపుతున్నావు అని హెచ్చరిక వస్తుంది. అపుడు వాడు సరి చేసుకుని సరిగ్గా చెబితే ఆ కర్మ వారికి నష్టం కలిగించదు. దాని వల్ల కష్టం రాదు.

కానీ ఎరుక లేకపోతే గొప్పకోసం చెప్పేస్తారు. తరువాత తెలుస్తుంది. తాను అబద్ధం చెప్పానని, ఇక అప్పుడు చేసేది ఏమీ వుండదు. ఎందుచేతనంటే ఎరుక లేని వారికి జాగ్రత్త పడే అవకాశం వుండదు. నష్టం జరగకుండా చేసుకునే అవకాశం వుండదు.

అందుకే పత్రీజీ ఎరుకతో మాట్లాడమంటారు. కారణం "మన నోటి మాటే మన నుదుటి వ్రాత" అవుతుందని ఆయన అలా చెప్పడం జరిగింది.

అందుచేత ఎరుక కలగాలంటే మనస్సు శూన్యం చేసుకోవాలి. దానికి ధ్యానం చెయ్యాలి. కానీ ఈ తిప్పలు జంతువులకు లేదు కారణం వాటికి మనస్సు లేదు కనుక. అవి ఎప్పుడూ పూర్తి ఎరుకతో వుంటాయి.

అందుచేత పత్రీజీ చెప్పినట్టు ధ్యానం చేద్దాం. మనస్సు శూన్యం చేసుకుందాం. తద్వారా దివ్యజ్ఞానం సంపాదించుకుందాం. తద్వారా ఎరుక (అవేర్‌నెస్) సంపాదించుకుందాం. నష్టం కలిగించే కర్మలు చేయకుండా జీవిద్దాం.

# పండగ

పండగలప్పుడు పండగ రోజుల్లో చాలా మంది సరదాగా గడపాలనుకుంటారు, వినోదించాలనుకుంటారు. అందుకోసం రకరకాల పనులు చేస్తూంటారు. విందులలో పాల్గొంటారు, కోళ్ళకు, పొటేళ్ళకు, ఎద్దులకు పోటీలు పెట్టి అవి రక్తం కారుస్తూ బాధపడుతంటే వీరంతా వినోదిస్తారు, పందాలు వేస్తారు. ఇంకా రకరకాల జంతువులను చంపి వాటి మాంసంతో విందు భోజనాలు చేస్తారు.

ఇంకా పేకాడతారు, మందు తాగుతారు, సినిమాలకు వెడతారు, క్లబ్బులకు వెడతారు, రకరకాల పోటీలలో పాల్గొంటారు, గేమ్సు ఆడతారు. ఇలా రకరకాల పనులు చేస్తూ ఆనందించామనుకుంటారు. పండుగ రోజున ఆనందం పొందామనుకుంటారు. ఇవన్నీ ఆనందం కలిగించే పనులనుకుంటారు. కానీ ఆనందం అంటే ఏమిటో తెలియదు. ఆనందం ఎక్కడ వుందో! అది ఎలా పొందాలో! ఆనందం పొందాలంటే ఏమి చెయ్యాలో తెలియదు.

ఎందుచేతనంటే ఇవన్నీ వినోదం కలిగించే పనులే కానీ ఆనందం కలిగించేవి కావు. వినోదించడమన్నది తాత్కాలిక ఉపశమనం. సహజంగా మానవులు ఎన్నో పనులు చేస్తూ వుంటారు. వాటితో పాటు సంసారంలో, సమాజంలో ఎన్నో సమస్యలు ఎదుర్కొంటూ వుంటారు. ఎప్పుడూ ఒకే విధమైన జీవితానికి అలవాటు పడి వుంటారు. ఉద్యోగం, వ్యాపారం, సంపాదన ఇలాంటి వాటి కోసం పరుగులు పెడుతూ వుంటారు. ఈ పరుగుల వల్ల సమస్యల వల్ల శాంతి వుండదు.

ఇంకా రోగాలు, కష్టాలతో బాధపడుతూ వుంటారు. అలాంటి పరిస్థితుల్లో మనస్సు వికలమై ఏమిటీ జీవితం? ఎందుకీ జీవితం? అని అనిపిస్తూ వుంటుంది. అటువంటి సందర్భాలలో మనస్సు మార్పు కోరుకుంటూ వుంటుంది, శాంతి పొందాలనుకుంటుంది, ఉన్న పరిస్థితి నుంచి కొంత ఉపశమనం పొందాలనుకుంటుంది. కానీ ఏ రోజు అలాంటి అవకాశం చిక్కదు, సావకాశం దొరకదు. కారణం ఎప్పుడూ పనులే, భాధ్యతలే, పరుగులే.

అలాంటి స్థితిలో వున్న మనస్సుకు ఈ పండగలన్నవి కాస్త

ఊరటనిస్తాయి, కాస్త మార్పును కలుగజేస్తాయి. అలా సమస్యలతో అశాంతిగా వున్నవారి మనస్సుకు ఈ వినోద కార్యక్రమాలు కాస్త ఉపశమనం కలిగిస్తాయి. ఆ ఒక్కరోజు కాస్త ఊరటనిస్తాయి. ఒకరకంగా పండగ రోజు తప్ప మిగిలిన రోజులలో అటువంటి అవకాశం వుండదు. అందుచేత పండగ రోజైనా వినోదించి ఉపశమనం పొందటానికి ప్రతి ఒక్కరూ ప్రయత్నిస్తూ వుంటారు.

అంతే తప్ప ఆ వినోద కార్యక్రమాలు ఆనందాన్ని మాత్రం ఇవ్వలేవు. చికాకులతో వున్న మనస్సుకు తాత్కాలిక ఉపశమనం మాత్రమే ఇవ్వగలవు. అందుచేత అందరూ అనుకున్నట్టు పండగ ఆనందం కలిగించేది కాదు. ఉపశమనం కలిగించేది. కారణం పండుగ అయిన మరునాడు నుంచి మరల మామూలు పరిస్థితే. మామూలు జీవితమే. మరి నిజమైన పండగ ఏది? అంటే ఆనందం కలిగించేదే! అంటే మానవుడు ఏ రోజైతే ఆనందం పొందగలడో! ఆ రోజే పండగ. అంటే ఎప్పుడు ఆనందం పొందగలిగితే అప్పుడే పండగ చేసుకున్నట్టు.

మరి ఆనందం ఎలా కలుగుతుంది? ఆనందం అన్నది భగవంతుని వల్ల మాత్రమే ఎవరైనా పొందగలరు. మరి భగవంతుడు ఎవరు? “ఆత్మ”. అంటే ఆత్మను ఎవరయితే పొందగలరో వారే ఆనందం పొందగలరు.

ఆ స్థితి ఎలా వస్తుంది? ‘ఆత్మజ్ఞానం’ పొందితే వస్తుంది. జ్ఞానం ఎలా వస్తుంది? ‘శ్వాస మీద ధ్యాస’ వుంచి ధ్యానం చేస్తే వస్తుంది. అందుచేత తెలుసుకోండి ఎవరైతే ధ్యానం చేస్తారో వారు జ్ఞానవంతులవుతారు. వారికే ఆనందం లభిస్తుంది. అలా ఆనందం పొందిన వారే పండగ చేసుకున్నట్టు. వారికి ఒక్కరోజే పండగ కాదు, నిత్యమూ ‘పండగే’.

# సేవే సంపాదన

చాలా మంది ధనం సంపాదిస్తేనే సంపాదించినట్టుగా భావిస్తారు. ధన సంపాదనే గొప్ప సంపాదన అనుకుంటారు. కానీ ఈ సృష్టిలో ధనం కంటే గొప్ప సంపాదన వుంది. అదే 'సేవ'. 'సేవ' కూడా సంపాదనే అని తెలుసుకోవాలి. అందుకే సత్యసాయిబాబా వారు 'సేవ' గురించే ప్రముఖంగా చెపుతారు. అందుచేత 'సేవ' గురించి కొంచెం తెలుసుకుందాం.

'సేవ' అన్నది ఇతరులకు ఆనందం కలిగించేది, అంటే లాభం కలిగించేది. ఇతరులకు చేసే సేవే లోకానికి చేసే సేవ. అలా లోకానికి చేసే సేవ ఒకరకంగా దైవానికి చేసే సేవ అవుతుంది. కారణం లోకమే దైవం కనుక. అందుచేత దైవానికి ఆనందం కలిగించేది ఏదంటే 'సేవ' మాత్రమే.

అలా ఎవరయితే లోకానికి సేవ చేస్తారో అంటే లాభం కలిగిస్తారో! వారు ఈ సృష్టిలో తప్పనిసరిగా లాభం పొందుతారు, అంటే ఆనందం పొందుతారు, సుఖ సంతోషాలు పొందుతారు. వారికి భవిష్యత్తులో మంచి ఆర్థిక స్థితి కలుగుతుంది. వారి జీవితం అనుకోని విధంగా గొప్పగా మారిపోతుంది. సకల భోగాలు అనుభవిస్తారు.

అందుచేత కోట్లు సంపాదించే కంటే! చేసేటటువంటి కొద్దిపాటి 'సేవే' గొప్పదని తెలుసుకోండి. అంతేకాదు **"శాశ్వతం కాని కొండంత ధనం కంటే శాశ్వతమైన గోరంత 'సేవే' గొప్పది".**

ఇంకా తెలుసుకోగలిగితే ప్రస్తుత ధనవంతులంతా గత జన్మలలో సేవలు చేసిన వారే. అలాగే ప్రస్తుత పేదవారు గతంలో ధనవంతులై వుండి సేవను మరచిన వారే. అందుచేత ఉండని ధనం కంటే వుండే 'సేవ' గొప్పదని తెలుసుకోండి. 'సేవ' చెయ్యండి. 'సేవ' కూడా ఈ సృష్టిలో సంపాదనే అవుతుంది.

ఈ లోకంలో రెండు రకాల సంపాదనలు వున్నాయి. అవి (1) ధనం, (2) సేవ. ఈ రెండు రకాల సంపాదనలకు వున్న తేడా చూద్దాం.

1) "ధనమన్నది కనిపించే సంపాదన, కానీ 'సేవ' కనిపించని గొప్ప సంపాదన".

2) "ధనం... కూడా రాని సంపాదన, కాని సేవ కూడా వచ్చే

సంపాదన".

3) "ధనం కోల్పోయే సంపాదన, కాని సేవ కోల్పోని సంపాదన".

4) "ధనం దుఃఖాన్ని, భయాలను పెంచే సంపాదన, కానీ సేవ ఆనందాన్ని, ధైర్యాన్ని పెంచే సంపాదన".

5) "ధనం తృప్తినివ్వని సంపాదన, కానీ సేవ తృప్తినిచ్చే సంపాదన".

6) "ధనం అందరిలో ఈర్ష్య, అసూయ, ద్వేషం పెంచే సంపాదన, కానీ సేవ అందరిలో గౌరవం, కీర్తి, విలువ పెంచే సంపాదన".

7) "ధనం భోగులు ప్రాముఖ్యం ఇచ్చే సంపాదన, కానీ 'సేవ' యోగులు ప్రాముఖ్యం ఇచ్చే సంపాదన".

ఎంత కష్టపడినా ధనం సంపాదించలేకపోవచ్చు కానీ 'సేవ' చేస్తే కష్టపడవలసిన అవసరం లేకుండా భవిష్యత్తులో ధనవంతులు కావచ్చు. అందుచేత సేవ యొక్క గొప్పతనం తెలుసుకోండి, సేవ చెయ్యండి. ఈ సృష్టిలో చేయవలసింది చేస్తే రావలసింది ఎప్పుడు రావాలో అప్పుడు వస్తుంది.

చిన్న ఉదాహరణ చూద్దాం. మీ ఇంట్లో పై ట్యాంక్‌లో నీళ్ళు లేవు. మోటారు వేద్దామంటే కరెంటు లేదు. కరెంటు ఎప్పుడు వస్తుందో తెలియదు. అపుడు ఏం చేస్తారు. కరెంటు కోసం ఎదురుచూస్తూ కూర్చోరు. మోటారు స్విచ్ వేసి మీ పనులు చూసుకుంటారు. ఎప్పుడో ఒకప్పుడు కరెంట్ వస్తుంది. స్విచ్ వేసి వుండటం వల్ల మోటారు ఆటోమేటిక్‌గా తిరుగుతుంది. మీ ట్యాంక్ నీళ్ళతో నిండుతుంది.

అలాగే ప్రస్తుతం మీ దగ్గర ధనం లేదు. ధనం సంపాదిద్దామంటే అవకాశం లేదు. అందుచేత ధనం కోసం ఎదురుచూడకండి. 'సేవ' చెయ్యండి. ధనం గురించి మర్చిపోండి. ఎప్పుడో ఒకప్పుడు కరెంటు వచ్చినట్టుగానే ఈ సృష్టిలో మీకు అర్హత వస్తుంది. ఆటోమేటిక్‌గా మీకు తెలియకుండా, వూహించని విధంగా మీకు ధనం సంప్రాప్తిస్తుంది. అందుచేత సేవ చేసిన వారు స్విచ్ వేసి మరచిపోయినట్టుగా మరచిపోవచ్చు. మీరు స్విచ్ వేసి మరచిపోయినా కరెంటు రాగానే మోటారు ఎలా తిరుగుతుందో... అలాగే 'సేవ' చేసి మరచిపోయినా, ఈ సృష్టిలో ఆ సమయం రాగానే మీకు ధనం వస్తుంది.

అంతేకాని ధనం లేదని, ధనం కోసం చేయకూడని పనులు చేస్తూ,

సృష్టి విరుద్ధంగా అక్రమంగా, అధర్మంగా సంపాదించడం కోసం ప్రయత్నించ వద్దు. కారణం అధర్మమార్గాల ద్వారా సంపాదించిన వారికి అనుభవించే యోగ్యత వుండదు. కానీ 'సేవ' ద్వారా సంపాదించుకున్న వారికి అనుభవించే యోగ్యత వుంటుంది. అందుచేత తెలుసుకోండి... ఈ సృష్టిలో 'సేవే' సక్రమమైన, ధర్మమైన సంపాదన.

ధనం సంపాదిస్తే ఏదో ఒక బ్యాంకులో వేసుకుంటాం కానీ 'సేవ' చేస్తే సృష్టిలో వేసుకున్నట్టు. ఈ రెండిటికి తేడా వుంది. ధన సంపాదన కనిపిస్తుంది. 'సేవ' ద్వారా సంపాదించింది కనిపించదు. లోకంలో కనిపించే దానికి ప్రాముఖ్యం ఇస్తారు. కనిపించని దానికి ప్రాముఖ్యం ఇవ్వరు. కానీ కనిపించే ధనం, సంపదలు కోల్పోయే అవకాశం వుంది. నష్టాలు వచ్చినా ప్రకృతి వైపరీత్యాలు, భూకంపాలు, తుఫానులు వచ్చినా సర్వం కోల్పోవచ్చు. కానీ "సేవ" ద్వారా సంపాదించింది, ఎన్ని ప్రకృతి వైపరీత్యాలు వచ్చినా చెక్కు చెదరదు. ఎక్కడికీ పోదు. ఈ సృష్టిలో మన కాతాలో వ్రాయబడి వుంటుంది.

అంతేకాదు ధనం మన కూడా రాదు. కానీ 'సేవ' ద్వారా సంపాదించుకున్నది చనిపోయినా మన కూడా మరు జన్మకు వస్తుంది. అందుచేత 'సేవ' ద్వారా సంపాదించింది గొప్పదని తెలుసుకోవాలి.

అందుచేత ధనం సంపాదిస్తేనే సంపాదించినట్టు కాదు. 'సేవ' చేసినా సంపాదించినట్టేనని తెలుసుకోండి. ఒక రకంగా ధనం సంపాదించిన వాడి కంటే 'సేవ' చేసేవాడే ఈ సృష్టిలో గొప్పవాడు. కారణం ధనవంతుడు కంటే 'సేవ' చేసేవాడే భగవంతుడికి ఇష్టుడు అవుతాడు. కారణం భగవంతుడు కూడా 'సేవ'నే మెచ్చుతాడు.

ఇక్కడ ఆలోచిస్తే అందరికీ 'సేవ' చెయ్యాలని వుంటుంది. కానీ చెయ్యలేరు. మరి 'సేవ' చెయ్యాలంటే ఎలా? ఎలాంటి వారు 'సేవ' చెయ్యగలరు?

'సేవ' చెయ్యాలంటే ముఖ్యంగా ఎవరైనా సరే ముందుగా జ్ఞానం పొందాలి. 'జ్ఞానం' పొందిన వారే 'సేవ' చెయ్యగలరు. విశేషంగా ధ్యానం చేస్తే, తొందరగా జ్ఞానం పొంది విశేషంగా 'సేవ' చెయ్యగలడు. లోకంలో 'జ్ఞానులంతా' సేవ చేసిన వారే. కారణం సేవలో తృప్తి వుంటుంది, ఆనందం వుంటుంది.

# "సేవలో రకాలు"

'సేవ'లో చాలా రకాలు వున్నాయి. అవి దేహ సేవలు, అంటే ఇతరుల దేహానికి లాభం కలిగించేవి. అలాగే మనోసేవలు అంటే ఇతరుల మనస్సుకు ఆహ్లాదం కలిగించేవి, వూరటనిచ్చేవి. అలాగే 'ఆత్మ' సేవలు అంటే ఇతరుల ఆత్మకు లాభం కలిగించేవి. అంటే ఇతరుల ఆత్మ ఉన్నతికి తోడ్పడేవి, ఆత్మ జ్ఞానాన్ని పెంచేవి, ఆత్మజ్ఞానాన్ని కలిగించేవి. వాటినే ఆత్మసేవలు అంటారు.

అన్నిటి కంటే ఆత్మసేవలే గొప్పవి. కారణం దేహం కంటే మనస్సు, మనస్సు కంటే ఆత్మ గొప్పది. అంతేకాదు దేహం, మనస్సు అశాశ్వతం. 'ఆత్మ' శాశ్వతం. కారణం ఆత్మే భగవంతుడు. అందుచేత ఆత్మకు చేసిన సేవ భగవంతునికి చేసిన సేవ అవుతుంది. అందుచేత ఆత్మ సేవలే చాలా చాలా గొప్పవి. 'ఆత్మ' సేవల వల్లే ఎవరైనా జ్ఞానవంతులవుతారు.

మరి ఆత్మ సేవలంటే ధ్యానానికి సంబంధించిన సేవలు. అంటే ధ్యానాన్ని ఉచితంగా అందరికీ బోధించడం. ధ్యాన కార్యక్రమాలు నిర్వహించడం, అందరి చేతా కూర్చోపెట్టి ధ్యానం చేయించడం, అలాంటి కార్యక్రమాలలో విరివిగా పాల్గొనడం. వాటికి ప్రోత్సాహమివ్వడం. ధ్యాన కార్యక్రమాలకు, ధ్యాన యజ్ఞాలకు ధన సహాయాన్ని చెయ్యడం. లేక సమయాన్ని, వాక్కును, శక్తిని దానం చెయ్యడం. ఇవన్నీ ఆత్మ సేవలు. అత్యుత్తమ సేవలు, ప్రస్తుతం పత్రిగారు చేస్తున్నారు.

అందుచేత 'ధ్యానం' చేయండి. 'ధ్యానం' చెప్పండి. 'ధ్యాన' కార్యక్రమంలో పాల్గొనండి. అందరినీ జ్ఞానులుగా చెయ్యండి. సమాజ సేవకు అంకితమయ్యేలా చెయ్యండి.

తెలుసుకోండి **"సేవకు మించిన సంపాదన లేదు! ధ్యానానికి మించిన సాధన లేదు".**

# ప్రకృతి

పత్రీజీ ఒక మాట అంటూంటారు. ఎవరైనా తప్పు చేసినపుడు అది ఆయన దృష్టికి తీసుకు వస్తే... "ప్రకృతి చూసుకుంటుందిలే" అని అనేవారు. ఆయన ఎందుకలా చెప్పేవారంటే ఈ ప్రపంచంలో ప్రతీది ప్రకృతిచే నడిపించబడుతుంది కనుక. ప్రకృతి నియమాల ప్రకారం అన్నీ జరుగుతున్నాయి. కనుక విరుద్ధంగా జరిగే వాటిని ప్రకృతే సరి చేస్తుంది కనుక. అంతేకాదు ప్రకృతి చాలా గొప్పది. ఎంతో విశిష్టమైనది. అందుచేత మనం కూడా ప్రకృతి గురించి తెలుసుకుందాం.

ఎందుకంటే మనమందరం ప్రకృతి నుంచే సృష్టించబడ్డాం. ప్రకృతిలో భాగమై వున్నాం. ప్రకృతితో ముడిపడివున్నాం. ప్రకృతిలో జీవిస్తున్నాం. ప్రకృతి సిద్ధాంతాలకు, నియమాలకు కట్టుబడి వున్నాం, ప్రకృతిచే నడిపించబడుతున్నాం. ప్రకృతితో ఇంత సంబంధం, అనుబంధం మనకి వుంది.

ఇంత అనుబంధమున్నప్పుడు మన ఇష్టమొచ్చినట్టు, మనకు నచ్చినట్టు జీవిస్తే, ప్రవర్తిస్తే, కర్మలు చేస్తే కుదరదు. ఈ ప్రకృతిలో వున్నవారు ప్రకృతి నియమాలను అనుసరించి జీవించాలి. ప్రకృతికి అనుగుణంగా జీవించాలి. అప్పుడే ఎవరి జీవితమైనా ఆనందంగా వుంటుంది. అలా కాకుండా ఎవరైనా ప్రకృతి విరుద్ధంగా జీవించినా, ప్రవర్తించినా, ప్రకృతి విధించే శిక్షలకు గురి కావలసి వస్తుంది. తద్వారా కష్టాలు అనుభవించవలసి వస్తుంది. అందుచేత అందరూ ప్రకృతి యొక్క గొప్పదనం తెలుసుకుని జీవించాలి.

చాలా మంది తమకు కష్టాలు వచ్చినపుడు, కష్టం కలిగినపుడు తనకు అన్యాయం జరిగిందని బాధపడుతూ వుంటారు. ప్రకృతి అంటే భగవంతుడు తనకు అన్యాయం చేసాడని బాధపడతారు. కానీ ఈ సృష్టిలో అన్యాయమనేది లేనే లేదు అంతా న్యాయమే అన్న విషయం తెలుసుకోవాలి.

అందుకే **"NATURE IS ALWAYS CORRECT"** అంటారు.

ప్రకృతి ఎప్పుడూ సరిగానే వ్యవహరిస్తుంది. ప్రకృతిలో ఏం జరుగుతున్నా, ఎలా జరుగుతున్నా అన్నీ సక్రమమే, అంతా న్యాయమే, అక్రమమనేది లేదు, అన్యాయమనేది లేనే లేదు. ఏం జరిగినా ప్రతిదానికి కారణం వుంటుంది. అది తెలుసుకునే శక్తి మానవుడికి లేదు. ప్రకృతి శక్తి ముందు మానవ ఇంద్రియాల శక్తి అత్యల్పం. ఒక సునామీ వచ్చినా, భూకంపం వచ్చినా,

అధిక వర్షాలు వచ్చినా, వర్షాలు లేకపోయినా, అతి వేడిగా వున్నా, ఎలా వున్నా కూడా అన్నీ సక్రమంగానే జరుగుతున్నాయి. అక్రమమేమీ లేదు. అందుచేత ప్రకృతిని, ప్రకృతి నిర్ణయాలను గౌరవించాలి. సంతోషంగా స్వీకరించాలి. ప్రకృతిని విమర్శించకూడదు, ప్రకృతిని కించపరచకూడదు, ప్రకృతిని ఎదిరించకూడదు, అలా చేస్తే మనమే నష్టపోతాం.

ముందు ప్రకృతి యొక్క గొప్పదనం కొంత తెలుసుకుందాం. ఆధునిక విజ్ఞానం అంటే టెక్నాలజీ పెరగడం వల్ల తుఫాన్ వస్తున్నప్పుడు కానీ, భూకంపాలు వస్తున్నప్పుడు కానీ, అగ్ని పర్వతాలు పేలుతున్నప్పుడు కానీ మానవులు తెలుసుకోగలుగుతున్నారు. కానీ వాటిని ఆపగలిగే శక్తి ఎవరికీ లేదు, చివరికి ఆ సైన్స్ కూడా ఏమీ చెయ్యలేదు, ఆపలేదు. కానీ దాని వల్ల జరిగిన నష్టాన్ని కొంతవరకు భర్తీ చేయగలుగుతున్నారు.

ప్రకృతి గురించి ఆలోచిస్తే ప్రతీదీ ఆశ్చర్యమే కలుగుతుంది. మానవుడు సృష్టించిన రోబోట్‌ని చూడండి. దాన్ని ఒకరు ఆపరేట్ చేస్తే గానీ పనిచెయ్యదు. రోబో పిల్లల్ని కూడా కనలేదు. కానీ ప్రకృతి సృష్టించిన మానవుడి మేధస్సు అపారం, అనంతం. ఈ ప్రపంచంలో వున్న అన్నీ కంప్యూటర్స్‌కి ఉన్నంత శక్తి, ఒక్క మానవ మేధస్సుకి మాత్రమే వుంది. కానీ మనం ఆ శక్తిని పూర్తిగా ఉప యోగించడం లేదు. అటువంటి మేధస్సుని సృష్టించినది ప్రకృతి. అందుకే ప్రకృతి అంత అద్భుతమైనది.

ప్రకృతిలో మనం ఏం చేసినా కూడా రికార్డు అవుతుంది. ఫలితం ఇవ్వబడుతుంది. మంచి చేస్తే మనకు మంచే జరుగుతుంది. ఉదాహరణకు మనం దానం చేస్తే ఎప్పుడో ఒకప్పుడు అనుకోకుండా ఆ డబ్బు మళ్ళీ మనకు తిరిగి వస్తుంది. అలాగే మనం డబ్బు పోగొట్టుకున్నామంటే అంతకు ముందు మనం అన్యాయంగా ఎవరిదో డబ్బు తీసుకుని వుంటాం. అందుకే అనుభవిస్తున్నారు. చెడు చేస్తే చెడే జరుగుతుంది. మనం చేసేది ఎవరికీ తెలియక పోవచ్చు, చూడక పోవచ్చు. కానీ ప్రతీదీ ప్రకృతిలో రికార్డు అవుతుందంటే ప్రకృతి ఎంత గొప్పదో మనం తెలుసుకోవచ్చు. ఒక రకంగా ప్రకృతి గురించి ఎంతో తెలుసుకున్నా తక్కువనే అనుకోవాలి.

కానీ ఎవరైతే ప్రకృతి గురించి తెలుసుకుని దానికనుగుణంగా జీవిస్తారో వారి జీవితం వైభోగమే. ప్రకృతి గురించి ఎంత ఎక్కువ తెలుసుకుంటే అంత జ్ఞానం వున్నట్టు. పూర్తిగా తెలుసుకోగలిగితే పూర్ణ జ్ఞానం వున్నట్టు. అందుకే జ్ఞానం సంపాదించుకోవాలంటారు.

# ప్రకృతి చట్టాన్ని మన చేతుల్లోకి తీసుకోకూడదు

చాలా మంది ఊరికే విమర్శిస్తూ వుంటారు. అది వారికి అలవాటైపోతుంది. కాలక్షేపం కోసం కూర్చుని చెప్పుకునే కబుర్లలో ఎన్నో విమర్శలు వుంటాయి. కొంతమందికి అది ఒక సరదాగా మారి పోతుంది. మరి కొంతమంది ఎదుటివాడు తనను విమర్శించాడని, అన్నాడని, దానికి ప్రతిగా తామూ విమర్శిస్తూ వుంటారు. ఇతరులు చేసిన చర్యలకు ప్రతిచర్యలు చేస్తూనే వుంటారు. అలా వారికి బుద్ధి చెప్పాను అని కొంతమంది, ప్రతీకారం తీర్చుకున్నామని కొంతమంది చెబుతూ వుంటారు. అలా ఇష్టం లేని వారి మీద వారికి వున్న కసి తీర్చుకుంటారు.

అలాంటి ప్రతి చర్యలు తనకు నష్టం కలిగించేవే అన్న విషయం వారికి తెలియదు. కారణం ఎవడు ఏమి చేసినా దానికి తగ్గ ఫలితం, శిక్ష ఈ సృష్టిలో అనుభవించవలసిందే. అది చిన్నదైనా, పెద్దదైనా సరే. అదే ఈ సృష్టి ధర్మం. అంటే ప్రకృతి ధర్మం. ఈ సృష్టిలోనే ప్రతి ఒక్కరూ గమనించబడుతున్నారు. గమనించబడటమే కాదు ప్రతి ఒక్కరూ చేసిన ప్రతి పని రికార్డు చేయబడుతుంది. రికార్డు చేయబడటమే కాదు, సందర్భాన్ని బట్టి దానికి తగ్గ ఫలితం ఇవ్వబడుతుంది అంటే శిక్ష విధించబడుతుంది.

అందుచేత ఇతరులు మనకు చేసిన అన్యాయం కానీ, అక్రమాలు కానీ, అవమానాలు కానీ మనకు కలిగించిన కష్టం కానీ, నష్టం కానీ, బాధ కానీ ఏదైనా సరే తగ్గ శిక్ష విధించటానికి ప్రకృతి వుంది. ప్రకృతి తప్పకుండా తన పని తాను చేస్తుంది. అందుచేత ఏదైనా ప్రకృతికి వదిలెయ్యాలి. ప్రకృతి చేసే పని మనం చెయ్యకూడదు.

కారణం చేసిన వాడు తప్పకుండా అనుభవించి తీరాలి, తీరతాడు. ప్రకృతి శిక్షించి తీరుతుంది. అందుచేత ఆ పని మనం చేయవలసిన పని లేదు. అలా చేస్తే మనం ఒకరకంగా చట్టాన్ని మన చేతుల్లోకి తీసుకున్నట్టే. అలా చేస్తే మనం దాని ఫలితం అనుభవించవలసి వస్తుంది. మరల కర్మలలో చిక్కుకోవలసి వస్తుంది.

అందుచేత ఎవరినీ విమర్శించకూడదు. నష్టపరచకూడదు. కష్ట

పెట్టకూడదు. విమర్శకు ప్రతివిమర్శ చేయకూడదు. ఎవరి గురించి తీర్పులు చెప్పకూడదు. ప్రతి చర్యలు చేయకూడదు. అలా చేస్తే చట్టం మన చేతుల్లోకి తీసుకున్నట్టే. అది కూడా నేరమే అవుతుంది.

అలాగే విమర్శలు ఎందుకు చేయకూడదో తెలుసుకుందాం. ఈ సృష్టిలో ప్రతి ఒక్కరూ తమ గుణాన్ని బట్టి ప్రవర్తిస్తూ వుంటారు. ఒక రకంగా వారి ప్రవర్తన వారి చేతుల్లో లేదు. వారి గుణంలో వుంది. గుణం కూడా ప్రకృతి సంబంధమైనదే. ప్రకృతిలోనిదే! అందుచేత వారు చేసే ప్రతి పని వారి గుణాన్ని అనుసరించే చేస్తున్నారు. అందుచేత మనం ఎవరినీ విమర్శించకూడదు.

మనం ఆ తప్పులు చేయనంత మాత్రాన, మనవేదో గొప్పవారమైనట్టు, వారేదో తప్పు చేసినట్టుగా విమర్శిస్తున్నాం. కానీ ఒకప్పుడు మనమూ అలా ప్రవర్తించినవారమే. మెల్లిగా గుణం మార్చుకుని మన తప్పులు సరి చేసుకున్నాం. వాడు కూడా మెల్లిగా తన తప్పు తెలుసు కుంటారు, సరి చేసుకుంటారు. ఇది సహజంగా ప్రకృతిలో జరిగేదే. అందుచేత ఏ రకంగా చూసినా మనం ఎవరినీ విమర్శించకూడదు. ఎవరి గురించి నిర్ణయాలు చేయకూడదు. వాడు అలాంటివాడు, ఇలాంటి వాడు అని తీర్పు చెప్పకూడదు.

అందుకే పత్రీజీ స్పష్టంగా చెపుతారు. "No Comments, No Judgement" ఈ స్థితి కూడా జ్ఞానం పొందిన వారికే వుంటుంది. జ్ఞానులే అలా ప్రవర్తించగలరు. అందుచేత ముందు జ్ఞానం పొందటానికి ప్రయత్నించాలి.

# ఎవరిదీ తక్కువ జన్మ, నీచ జన్మ, హీన జన్మకాదు!

సమాజంలో రకరకాల వాళ్ళు కనిపిస్తారు. ధనవంతులు-పేదవారు, యజమానులు-పనివారు, రాజులు-సేవకులు, ఆరోగ్యవంతులు- రోగగ్రస్తులు, మేధావులు-మందభాగ్యులు, సౌందర్యవంతులు-కురూపులు, అధికారులు-అడుక్కునేవారు ఇలా రకరకాల వారు కనిపిస్తూ వుంటారు.

అలా కనిపిస్తూ వున్నప్పుడు సహజంగా కొన్ని రకాల వారిని అంటే ధనవంతులను, అధికారంలో వున్నవారిని, ఏ రంగంలోనైనా ఉన్నత స్థితిలో వున్న వారిని చూసి, వారివి గొప్ప జన్మలు అనుకుంటాం. వారు ఎంత అదృష్టవంతులు అంటాం. కొంతమందిని అంటే అడుక్కునే వారిని, పుట్టుకతో రోగగ్రస్తులు, పేదవారిని, మురికి కూపాల్లో నివసించే వారిని, ఫ్లాట్‌ఫారాలపై జీవించే వారిని చూసి వారిది హీనజన్మ అనుకుంటాం. బాహ్యంగా చూస్తే అలాగే అనిపిస్తుంది. పాపం ఎలాంటి జన్మ లభించిందో? అన్నీ కష్టాలే. ఎంత హీనమైన బ్రతుకు? ఎంత దుర్భరమైన జీవితం? ఎంత నీచమైన జన్మ? అని అనిపిస్తూ వుంటుంది. వారు ఎంత దురదృష్టవంతులు అంటూ వుంటాం. చూస్తే అలా అనడం సహజమే.

కానీ మన జ్ఞానాన్ని, జ్ఞాన పరిధిని పెంచుకుంటూంటే ఎవరిదీ తక్కువ జన్మ కాదు, ఎవరిదీ ఎక్కువ జన్మ కాదు, అన్నీ గొప్పజన్మలే, అన్నీ విశిష్టమైనవే అని అర్థమవుతూ వుంటుంది. సత్యం ఏమిటంటే అంతా ఒక్కటే! అంతా సమానమే.

అలా ప్రతి ఒక్కరూ ప్రతి జన్మలో చేసిన కర్మల నుంచి కొన్ని పాఠాలు నేర్చుకుంటూ వుంటారు. అలా జీవితంలో పాఠాలు నేర్చుకోవటానికే అటువంటి జన్మ. అసలు ఎవరిది ఎటువంటి జన్మ అయినా... పైకి ఎక్కువగానూ, తక్కువగానూ కనిపిస్తున్నా అన్నీ పాఠాలు నేర్చుకోవటానికే.

ఉన్నతంగా వున్నారని అనుకునేవారు కొన్ని రకాల పాఠాలు నేర్చుకుంటున్నారు. అలాగే తక్కువగా కనిపిస్తున్న వారు కూడా కొన్ని రకాల పాఠాలు నేర్చుకుంటున్నారు. ఎవరైనా అలా ఆ జన్మ మాత్రమే వుంటారు. మరల జన్మ మారిపోతుంది. అంటే రాజు పేద అవుతాడు, పేద రాజు అవుతాడు. స్త్రీ పురుషుడు అవుతుంది, పురుషుడు స్త్రీ అవుతాడు. ఇప్పుడు చెప్పండి! అలా

జన్మ మారినపుడు ఎవరు గొప్పవారు? ఎవరు తక్కువ వారు? ఆ ఒక్క జన్మనే చూస్తే అలా అనిపిస్తుంది. కానీ ఆత్మపరంగా అంటే జన్మపరంపరగా చూస్తే, అసలు సత్యం తెలుస్తుంది.

సత్యం ఏమిటంటే అంతా ఒక్కటే. సృష్టి, పరిణామ క్రమంలో వివిధ దశలలో రకరకాల పాఠాలు నేర్చుకోవడం కోసం తీసుకున్న జన్మలు, పరీక్ష తప్పిన వాడు అదే క్లాసులో పాఠాలు ఎలా నేర్చుకుంటాడో అంతే తప్ప ఇక్కడ ఎవరూ తక్కువ కాదు, ఎవరూ ఎక్కువ కాదు. ఎందుచేతనంటే ఆ ఒక్క జన్మను బట్టి చూడకండి. ఆత్మను బట్టి జన్మ పరంపరను బట్టి చూడండి, అప్పుడు అంతా అర్థమవుతుంది.

చూడండి ఎన్.టి.రామారావు ఒక సినిమాలో పేదవాడిగా వేషం వేస్తాడు. అతని దగ్గర పని చేసే డ్రైవరు రాజుగా వేషం వేస్తాడు. ఇప్పుడు చెప్పండి. ఇద్దరిలో ఎవరు గొప్ప? తాత్కాలికంగా రాజు వేషం వేసినంత మాత్రాన ఆ డ్రయివరు గొప్పవాడవుతాడా? పేదవాడిగా వేషం వేసినంత మాత్రాన ఎన్.టి.ఆర్. తక్కువ వాడవుతాడా? ఈ ఎక్కువ తక్కువలు కొంతసేపే. ఆ వేషం వున్నంత సేపే. అలాగే ఈ జన్మలోని ఎక్కువ తక్కువలు ఆ కాస్తసేపే. వాడైనా, వీడైనా ఆ జన్మ దేనికంటే పాఠాలు నేర్చుకోవటానికి. అక్కడ జన్మను చూస్తున్నాం కానీ వారు నేర్చుకునే పాఠాల గురించి ఆలోచించడం లేదు.

ఆ వేషంలో పాఠాలు బాగా నేర్చుకుంటే వారు బాగా ఎదుగుతారు. అలాగే తీసుకున్న జన్మలో పాఠాలు సరిగ్గా నేర్చుకోకపోతే ఆత్మ ఎదుగుదల వుండదు. అలాంటి పాఠాలు నేర్చుకోవడానికి మరల జన్మ తీసుకోవలసి వస్తుంది. అందుచేత గొప్పతనం నేర్చుకునే పాఠాన్ని బట్టి వుంటుంది కానీ జన్మలోని పాత్రని బట్టి వుండదు.

నీచపాత్ర వేసి బాగా పాఠాలు నేర్చుకుంటే బాగా ఎదిగినట్టు లెక్క. ఒకవేళ గొప్పజన్మ లభించినా అంటే గొప్పపాత్ర వేసినా సరిగ్గా పాఠాలు నేర్చుకోకపోతే (ఆత్మ) ఎదగనట్టే. ఇప్పుడు చెప్పండి? ఏది గొప్పజన్మ.

**"ఎక్కువలో పుట్టినా, తక్కువలో పుట్టినా తనువులు శాశ్వతం కాదు. ఎందరో పుట్టినా భగవంతుని (ఆత్మ) ఎవరైతే నమ్ముతారో వారికే ముక్తి మార్గం లభిస్తుంది".**

**– శ్రీ బాలయోగి**



చిన్న ఉదాహరణ చూద్దాం. ఒక కాన్వెంట్‌లో పేద పిల్లవాడు ధనవంతుడి పిల్లవాడు ఇద్దరూ చదువుతున్నారు. పేదవాడు నడచి వస్తాడు. ధనవంతుడు కారులో వస్తాడు. చూసేవారికి కారులో వచ్చేవాడు గొప్పవాడిలా కనిపిస్తాడు. కానీ క్లాసులో తక్కువ వాడిలా కనిపించే పేద పిల్లవాడే పాఠాలు బాగా నేర్చుకుని ఎక్కువ మార్కులు సంపాదిస్తాడు. చదువు అయిన తరువాత పేదపిల్లవాడు గొప్పఉద్యోగం సంపాదిస్తాడు. బాగా ఎదుగుతాడు. కానీ డబ్బున్న పిల్లవాడు చదవలేకపోవడం వల్ల చిన్న ఉద్యోగంతో సరిపెట్టుకోవాల్సి వస్తుంది.

ఇప్పుడు చెప్పండి ఎవరు గొప్పవారో? పాఠాలు నేర్చుకున్నవాడా? కారు వున్నవాడా? ఈ జన్మలు కూడా అంతే. అందుచేత ఇక్కడ ఎక్కువ తక్కువ జన్మలంటూ లేవు. గొప్ప, నీచ జన్మలు అంటూ ఏవీ లేవు అన్నీ ఒకటే! అంతా ఒకటే! అన్నీ పాఠాలు నేర్చుకోవటానికే! నేర్చుకుని (ఆత్మ) ఎదగటానికే. ఇక్కడ అందరూ ఆత్మలే. అందరు పిల్లలు ఒకే స్కూలులో చదువుకున్నట్టు, పాఠాలు నేర్చుకున్నట్టు...ఆత్మలైన అందరూ ఈ శరీరంతో భూమి మీద చేసిన కర్మలను బట్టి పాఠాలు నేర్చుకుంటున్నారు. అందుచేత ఎక్కువ తక్కువలు చూడకండి. ఇక్కడ ఎవరూ అదృష్టవంతులు కాదు, ఎవరూ దురదృష్టవంతులు కాదు. అంతా పాఠాలు నేర్చుకుంటున్న వారే అంతా ఎదుగుదలకు ప్రయత్నిస్తున్న ఆత్మలే! అంతా సమానమే. ఇవన్నీ 'జ్ఞానం' అంటే 'ఆత్మజ్ఞానం' కలిగిన వారికే అర్థమవుతుంది.

అందుకే పత్రిగారు అందరినీ సమానంగా చూడమంటారు, చూస్తారు. అందుచేత ధనం వుందని, పదవి వుందని, గొప్ప హోదావుందని గర్వించకూడదు. అహంకరించకూడదు. పేదవారిమని, ఏమీ లేదని బాధపడకూడదు. విచారించకూడదు. ఎటువంటి వారైనా వారి జీవితంలో ఎటువంటి సంఘటనలు జరుగుతున్నా అవి సంతోషకరమైనవి కావచ్చు, దుఃఖకరమైనవి కావచ్చు. వాటి నుండి ఏమి నేర్చుకోవాలి అని ఆలోచించాలి. జీవితంలో ఈ సంఘటన నాకు ఏమి పాఠం నేర్పుతుంది? అన్నది ఆలోచించాలి. కారణం అలా జీవిత పాఠాలు నేర్చుకోవడానికి వచ్చిన వారే. ఇక్కడ ఎక్కువ తక్కువలు లేవు. ఎవరిది నీచ జన్మ, తక్కువ జన్మ కాదు. అన్నీ విశ్వమైనవే.

# ఎక్కడా పతనం లేదు - అంతా పురోగమనమే!

సహజంగా పాపాలు చేసేవారు అధోలోకాలకు, పుణ్యాలు చేసేవారు, ధ్యాన సాధన చేసేవారు ఊర్థ్వ లోకాలకు చేరుకుంటారు. అటువంటప్పుడు పాపాలు చేస్తే సృష్టిలో అధోలోకాలకు పోవడం వల్ల పతనం చెందుతారని నష్టపోతారని సహజంగా అనుకుంటాం.

కానీ పత్రి గారు ఆత్మకు తిరోగమనం వుండదు అంతా పురోగమనమే వుంటుంది అంటారు. కారణం పాపాలు చేసి అధోలోకాలకు వెళ్ళినా మరల ఆ పాప ఫలితం అనుభవించడం కోసం భూమి మీద జన్మ తీసుకుంటారు. అలా జన్మ తీసుకుని కష్టాలు అనుభవిస్తూ అనుభవం పొందుతారు. తద్వారా పాఠాలు నేర్చుకుని జ్ఞానం సంపాదించుకుంటారు. అటువంటి తప్పులు మరల చెయ్యరు. అలా జీవితంలో పాఠాలు నేర్చుకుని తప్పులు చేయకపోవడమే ఆత్మ ఎదుగుదల. అలా మానవుడు ఎన్ని తప్పులు సరి చేసుకుంటే అంత ఎదిగినట్టు.

అలా అధోలోకాలకు వెళ్ళినా అనుభవంతో తప్పులు సరి చేసుకోవడం వల్ల ఆత్మపరంగా చూసుకుంటే పురోగమించినట్టే లెఖ్ఖ. ఎదుగుతున్నట్టే లెఖ్ఖ. అందుచేత 'ఆత్మ' ప్రయాణం అంతా 'జ్ఞానం' పొందటానికే. 'జ్ఞానాన్ని' పెంచుకోవటానికే.

అందుచేత అంతా పురోగమనమే కానీ ఆత్మకు తిరోగమనం లేదు అంటే పతనం లేదు అని పత్రీజీ అంటారు.

అందుకే శ్రీ కృష్ణుల వారు (భ.గీ.2-47) కర్మలు మానవద్దు అన్నారు. కర్మలు చెయ్యమన్నారు. అవి పాప కర్మలైనా సరే! కారణం అవి కూడా మానవుని జ్ఞానవృద్ధికి, ఆత్మ ఎదుగుదలకు ఉపకరించేవే.

అందుచేత ఆత్మకు ఎక్కడా పతనం లేదని తెలుసుకోవాలి. అంతా పురోగమనమే.

# అందరిలోని గొప్పతనాన్ని గుర్తించగలగాలి

చిన్నపిల్లవాడు నడవటం నేర్చుకున్నప్పుడు తప్పటడుగులు వేస్తూన్నప్పుడు పడకుండా నడిస్తే తప్పట్లు కొట్టి ప్రోత్సహిస్తాం. దాని అర్థం నడవడం గొప్ప అని కాదు. నడకను ప్రదర్శించడం గొప్ప అని కాదు. నడిస్తే తప్పట్లు కొట్టాలని కాదు. అలా అయితే నడిచేవాళ్ళందరికీ తప్పట్లు కొట్టాలి. కొడుతున్నామా? కొట్టం కదా?

నడకరానివాడు, నడవడానికి ప్రయత్నిస్తూ, ఒక కొత్త విద్యను నేర్చుకున్నప్పుడు వాడిని ప్రోత్సహిస్తాం. అలా ఎదిగే కొద్దీ పిల్లలు వారు కొత్త కొత్త విద్యలు ప్రదర్శిస్తున్నప్పుడు  ప్రోత్సహిస్తూ వుంటాం. కానీ అటువంటి విద్యలు ఇంతకుముందు అందరూ ప్రదర్శించినవే, అందరూ చేస్తున్నవే. కానీ ఎందుకు ప్రోత్సహిస్తామంటే వాడు ఇంకా కొత్త విద్యలు నేర్చుకోవాలని, ప్రదర్శించాలని, ఎదగాలని.

అలాగే పత్రిగారు ఎవరు ఏ విషయంలో నేను ఇది సాధించాను, అది తెలుసుకున్నాను, ఈ పని చేసాను, ఇది చెప్పాను, ఈ అనుభవం వచ్చింది అని అన్నపుడు అందరి చేత చప్పట్లు కొట్టించి వారిని ప్రోత్సహిస్తారు. కారణం వారు చెప్పినవి, చేసినవి, నేర్చుకున్నవి, తెలుసుకున్నవి గొప్పవని కాదు అందరికీ తెలియవని కాదు, ఆ స్థితిలో వారు అవి తెలుసుకున్నారు, అది సాధించారు. అందుచేత వారిని ప్రోత్సహిస్తారు. దేనికి అంటే? వారు ఇంకా సాధించడానికి, సాధించాలని అలా ప్రోత్సహిస్తారు.

కానీ సహజంగా చూసేవారు ఏమనుకుంటారంటే! ఏమిటి? ఈ మాత్రం దానికే వారికి చప్పట్లు కొట్టించాలా? అవి ఏమంత గొప్పవి? అవి మేమూ చేస్తున్నాం కదా? మేము అంతకన్నా గొప్పవి చేస్తున్నాం కదా? అలా అయితే మాకు ఎన్ని చప్పట్లు కొట్టాలి? అని అనుకుంటూ వుంటారు. కారణం పత్రిగారి చర్యలు అర్థం కాక.

తప్పటడుగులు వేసేవాడి అడుగులకు, నడకకు తప్పట్లు కొడతాం కానీ, ఎదిగిన తరువాత పరుగు పెట్టగలిగిన వాడిని నడిపించి తప్పట్లు

కొడితే ఎలా వుంటుంది? చెప్పండి? అలా చప్పట్లు కొడితే వాడికే అవమానంగా వుంటుంది. అదేమైనా గొప్పపనా? చప్పట్లు కొట్టడానికి అని అనుకుంటాడు.

అందుచేత నేర్చుకున్నవారు నేర్చుకునేవాడిని ప్రోత్సహించాలే కానీ అసూయ పడకూడదు. అలా ప్రోత్సహించడం జ్ఞాని లక్షణం. కానీ నాకూ తెలుసు. అదేమైనా గొప్పపనా? అని అనుకోవడం అజ్ఞానపు లక్షణం.

అలా కొత్త విద్య నేర్చుకున్న పిల్లవాడిని ప్రశంసించడం, ప్రోత్సహించడం, తండ్రి ధర్మం. అలాగే కొత్త జ్ఞానం తెలుసుకున్న, నేర్చుకున్న శిష్యుని ప్రశంసించడం, ప్రోత్సహించడం గురువు ధర్మం.

అంతేతప్ప అక్కడ వాడేదో గొప్ప పని చేసినట్టు కాదు. వాడినేదో గుర్తించనట్టు కాదు. ఈ విషయంలో ఇంకో రకంగా భావించినా, ఆలోచించినా వారు అజ్ఞానంలో వున్నట్టే.

తప్పటడుగులు వేసేవాడికి చప్పట్లు కొడితే పెద్దపిల్లవాడు అసూయపడతాడా? ఏమంత గొప్పపని అంటాడా? తండ్రితో పాటు వాడు చప్పట్లు కొడతాడు. నేర్చుకుంటున్నందుకు ప్రోత్సహిస్తాడు. అలాగే ఎదిగే శిష్యులను ఇతర సీనియర్ శిష్యులు కూడా ప్రోత్సహించాలి. అంతేకాని అసూయ పడకూడదు.

అందుకే పత్రిగారి ప్రవర్తన ఎవరికీ అర్థం కాదు.

# ఆయుష్షు

ఈ సృష్టిలో సృష్టించబడిన ప్రతీది కొంతకాలమే వుంటుంది. తరువాత అది అదృశ్యమైపోతుంది. అలాగే పుట్టిన ప్రతీది కొంతకాలమే జీవిస్తుంది. దీనినే ఆయుష్షు అంటారు. ఆయువు తీరగానే అది చైతన్య రహితమైపోతుంది. పని చెయ్యదు. చనిపోయింది అంటాం.

అలాగే సృష్టింపబడినది ఏదైనా సరే... ఒక ఇల్లు కావచ్చు, మేడ కావచ్చు, ఒక ఫ్యాక్టరీ కావచ్చు, ఇండస్ట్రీ కావచ్చు, వ్యాపార సంస్థ కావచ్చు, రాజకీయ పార్టీ కావచ్చు. వేటికైనా ఆయువు కొంతకాలమే వుంటుంది. ఆయువు తీరగానే అవి ఆధ్యాత్మిక సంస్థ కావచ్చు, మతం కావచ్చు. ఆశ్రమాలు కావచ్చు. అది ఏదైనా పని చెయ్యకపోవచ్చు. మూతబడిపోవచ్చు. కొన్నాళ్ళకు స్వరూపం మారిపోవచ్చు. లేకపోతే అదృశ్యమైపోవచ్చు కూడా.

ఒక్కొక్కరికి ఒక్కో రకమైన ఆయుష్షు వుంటుంది. కొంతమంది పుట్టగానే ఆయువు తీరిపోతుంది. కొంతమందికి చిన్న వయస్సులో ఆయువు తీరిపోతుంది. కొంతమందికి యవ్వనంలో, కొంతమందికి మధ్య వయస్సులో, కొంతమందికి వృద్ధాప్య దశ వచ్చినపుడు ఆయువు తీరిపోతుంది. కొంతమంది పండు ముదుసలి అయినా కూడా జీవిస్తూ వుంటారు. కారణం ఆయువు తీరలేదు కాబట్టి.

అలాగే కొన్ని బిల్డింగులు కానీ, వ్యాపార సంస్థలు కానీ, ఇండస్ట్రీలు కాని, రాజకీయ పార్టీలు గాని, ఆశ్రమాలు, ఆధ్యాత్మిక సంస్థలు గాని, మతాలు కానీ గమనిస్తే అవి ప్రారంభం కాకుండానే పని చెయ్యవు అంటే వాటి ఆయుః ప్రమాణం అంతమటుకే ఉందన్నమాట. కానీ కొన్ని కొంతకాలం వుంటాయి. అంటే కొంతకాలం పని చేస్తాయి. అంటే వాటికి కొద్దిపాటి ఆయుష్షు వున్నట్టు లెఖ్ఖ. కానీ కొన్ని ఇంకా ఎక్కువ కాలం వుంటాయి. అంటే వాటికి ఆయుష్షు ఇంకా ఎక్కువ వుందన్నమాట. కొన్ని ఇంకా, ఇంకా ఎక్కువ కాలం వుంటాయి. అంటే వాటికి ఆయుష్షు బాగా ఎక్కువ అన్నమాట. అంటే వేటి ఆయుః ప్రమాణాన్ని బట్టి అవి వుండటం, మనుగడ సాగించడం జరుగుతుంది.

సృష్టిలో వున్న గొప్పతనమేమిటంటే ఎవరి ఆయుః ప్రమాణాన్ని ఎవరూ మార్చలేరు, అది అసాధ్యం. అంతా సృష్టి నిర్ణయం ప్రకారం జరుగుతుంది,

సృష్టి నిర్ణయం మార్చడమన్నది మానవమాత్రునికి సాధ్యం కాదు, ఎటువంటి వారికి సాధ్యం కాదు. అందుచేత సృష్టిలో జరిగే సంఘటనల గురించి, మార్పులు గురించి బాధపడి ప్రయోజనం లేదు, ఏడ్చి ప్రయోజనం లేదు.

అందుచేత ఎవరైనా చనిపోతే ఏడవడం, ఏదైనా బిల్డింగు పని చెయ్యకుండా పడివున్నా, ఏదైనా వ్యాపార సంస్థ గాని, ఇండస్ట్రీ కానీ పని చెయ్యకపోయినా, ఆగిపోయినా, నడవకపోయినా బాధపడవలసిన పని లేదు. విచారించవలసిన పని లేదు. అలాగే కొన్ని రాజకీయ పార్టీలు, ప్రభుత్వాలు, ఆధ్యాత్మిక సంస్థలు, ఆశ్రమాలు, మతాలు, విద్యాలయాలు, అనేక రకాల సంస్థలు కొన్నాళ్ళకు కనుమరుగైపోయినా ఆశ్చర్యపోవలసిన పని లేదు.

అన్నీ కూడా వాటి వాటి ఆయుః ప్రమాణాన్ని బట్టే మనుగడ సాగిస్తూంటాయి. ప్రతీదానికి ఆయుః ప్రమాణం ముందే నిర్ణయించబడుతుంది. కాబట్టి ముందే నిర్ణయించబడిన ఆయుః ప్రమాణాన్ని ఏ జాతకము, ఏ వాస్తు, సిద్ధాంతము మార్చలేదు. అందుచేత అటువంటి ప్రయత్నాలు అన్నీ వ్యర్థమని తెలుసుకోవాలి. వాటికోసం వెచ్చించే ధనం లోక కళ్యాణం కోసం వినియోగిస్తే కనీసం ఆ ఫలితమైనా పొందవచ్చు.

ఇదంతా "ఆత్మజ్ఞానం" వున్న వారికే అర్థమవుతుంది.

# తల్లి గొప్పతనం!

కడుపు నింపేది, ఆకలి తీర్చేది అమ్మే. ఆ అమ్మనే 'తల్లి' అని కూడా అంటాం. 'మాతా' అని కూడా అంటాం. చూడండి 'తల్లి' బిడ్డకు పాలిచ్చి కడుపు నింపి బిడ్డ ఆకలి తీరుస్తుంది. అందుచేత ఏ బిడ్డ అయినా తల్లికి కృతజ్ఞత చూపిస్తూ వుంటుంది. తల్లి పట్ల కృతజ్ఞతా భావంతో వుంటుంది.

అంతేకాదు తల్లి ఋణం తీర్చుకోలేరు అంటారు. కారణం తాను భూమి మీదకు రావటానికి, ఉండటానికి కారణం తల్లే. అంతేకాదు మాతృదేవోభవ అని కూడా అంటారు. కారణం దేవుడు మాత్రమే సృష్టించగలడు. అలాగే తల్లి కూడా నవమాసాలు మోసి, ప్రసవ వేదన అనుభవించి బిడ్డను సృష్టించింది. బిడ్డ సృష్టికి కారణమైంది. కనుక తల్లి దైవంతో సమానం.

అలాగే గోవు కూడా.  తాను బిడ్డను సృష్టించడమే కాదు, తన బిడ్డతో పాటు ఎంతో మందికి పాలిచ్చి పోషిస్తుంది, ఆకలి తీరుస్తుంది. అందుకే గోమాత అని అంటాం. గోవుని కృతజ్ఞతతో చూస్తాం.ఆరాధిస్తాం కూడా.

అలాగే మనకు లాభాలు కలిగించేవి ఇంకొన్ని వున్నాయి. అవే మొక్కలు, చెట్లు, వృక్షాలు, అవి కూడా మనకు కాయగూరలు, పండ్లు, పప్పు దినుసులు ఇచ్చి మన ఆకలి తీరుస్తున్నాయి. మన ఆహారపు అవసరాలు తీరుస్తున్నాయి. ఒక రకంగా అవి కూడా తల్లితో సమానమే. కారణం అవి జన్మనివ్వకపోయినా జన్మంతా జీవించడానికి మానవులకు ఇతర జీవరాశికి ఎంతగానో సాయం చేస్తున్నాయి. ఒక రకంగా వృక్షాలే ఈ భూమి మీద జీవరాసి అంతా జీవించి వుండటానికి కారణం. అందుచేత మొక్కల పట్ల కూడా కృతజ్ఞతా భావం కలిగి వుండాలి. ఆరాధనా భావంతో చూడాలి. కృతజ్ఞత చూపించాలి. మొక్కలను  హక్కుగా కాకుండా కడుపునింపుతున్నదనే భావంతో చూస్తే మొక్కలు పట్ల కృతజ్ఞతా భావం కలుగుతుంది.

జ్ఞానం కలిగిన వారికే ఇదంతా అర్థమవుతుంది. ఈ గొప్పతనం తెలుస్తుంది.

# ఇష్టమైనది కాదు- నష్టం లేనిది చెయ్యాలి

ఎవరైనా సరే ఇష్టమైన పని చేయడానికి చూస్తారు. అంతేకాని అది నష్టమా? కాదా? అని ఆలోచించరు. కానీ తెలుసుకోవలసింది ఏమిటంటే! ఇష్టమైన పని చేసి నష్టపోవడం కంటే... నష్టం కలిగించని పని చేసి లాభం పొందాలి. అందుకే "ఇష్టమైనది కాదు, నష్టం లేనిది చెయ్యాలి "ఒకవేళ అది కష్టమైనా సరే!" అంటారు.

ఎందుచేతనంటే ఒక్కొక్కసారి మనకిష్టమైన పని మనల్ని కష్టాల పాలు చేయవచ్చు కూడా! సహజంగా సృష్టి విరుదద్ధమైన అంటే అధర్మమైన పనులు మనకు ఇష్టం కావచ్చు కానీ అవి చివరకు మనల్ని కష్టాల పాలు చేయడమే కాదు సర్వనాశనం కూడా చేస్తాయి.

ఉదాహరణకు మహాభారతంలో శ్రీ కృష్ణుల వారు దుర్యోధనునికి రాయబార సమయంలో పాండవుల రాజ్యం పాండవులకు ఇవ్వమని, కనీసం ఐదు ఊళ్ళయినా ఇవ్వమన్నారు. కానీ దుర్యోధనుడు అది అధర్మమవుతే అవ్వవచ్చు కానీ, వారికి ఏమీ ఇవ్వకపోవడమే నాకు ఇష్టం అని చెప్పడం జరిగింది.

అలా దుర్యోధనుడు ఇష్టమైన పని చేసి యుద్ధంలో రాజ్యాన్నంతా కోల్పోవడమే కాదు, చివరకు సర్వనాశనమయ్యాడు. ఇదంతా ఎందుకు జరిగిందంటే ఇష్టమని చేయడం వల్లే. అందుచేత తెలుసుకోండి. ఒక్కొక్కసారి మనకి ఇష్టమైన పనే మనకు నష్టం కలిగించవచ్చు.

అందుచేత ఆ పని మనకు ఇష్టమా? కాదా? అని చూడకూడదు. అది నష్టమా? కాదా? అని చూడాలి. అది కష్టమైనా సరే మనకు నష్టం కలిగించని పనే చెయ్యాలి.

మరి ఏది నష్టం లేని పని అంటే ఈ సృష్టిలో ధర్మమైన పనే నష్టం లేని పని. అందుచేత కష్టమైనా సరే ధర్మమైన పనులు చెయ్యాలి, ధర్మంగా జీవించాలి, ధర్మాన్ని ఆచరించాలి, ధర్మాన్ని కాపాడాలి, ధర్మాన్ని పాటించాలి.

చూడండి చాలా మందికి మాంసం తినడం ఇష్టమైన పని. కారణం చాలా రుచిగా వుంటుంది కాబట్టి. ఆ వంటకాలు చూడగానే లొట్టలు వేస్తారు.

ఎంతో ప్రీతిగా, ఇష్టంగా తింటారు. ఆ వంటకాలు అందరికీ ఇష్టం కాబట్టే ప్రతీ ఫంక్షన్‌లోను, పార్టీలోను, శుభకార్యాలలో కూడా మాంసాహార వంటకాలు చేస్తున్నారు. చెయ్యడమే కాదు, ఎన్ని రకాలు చేస్తే అంత గొప్పగా భావిస్తున్నారు. ఇదంతా దేనికి చేస్తున్నారంటే అవి అందరికీ ఇష్టమైనవి కాబట్టి. అలా ఇష్టానికి ప్రాముఖ్యం ఇస్తున్నారు తప్ప అంతకన్నా ఎవరూ ఆలోచించడం లేదు.

ఎందుచేతనంటే మాంసాహారం వెనుక ఎంతో హింస దాగి వుంది. ఎన్నో జంతువులను, పక్షులను, సముద్ర జీవులను హింసిస్తే కానీ మాంసాహారం తయారు కాదు. ఆ జంతువులను, పక్షులను క్రూరంగా చంపుతున్నారంటే ఇష్టమే అందుకు కారణం.

కానీ అలా హింసించడం, హింసకు కారకులు కావడం సృష్టి ధర్మానికి విరుద్ధం అంటే అధర్మం. వారు శిక్షింపబడతారు. ఆ శిక్షలే మానవులకు వచ్చే కష్టాలు. అందుచేత మాంసం తినడం ఇష్టమైన పనే కాని చివరకు అది కష్టాల రూపంలో నష్టాన్ని కలిగిస్తుందని తెలుసుకోవాలి.

మాంసాహారమే కాదు. మానవులు ఇష్టమని చేసే ఎన్నో పనులు వారికి నష్టాన్ని కలిగిస్తున్నాయి. ఉదాహరణకు, ధనం సంపాదించడం అందరికీ ఇష్టమే కానీ దాని కోసం లంచాలు తీసుకోవడం, అక్రమ మార్గాలు అనుసరించడం, అబద్ధాలు చెప్పడం, అన్యాయంగా ప్రవర్తించడం, అవినీతికి పాల్పడటం, మోసగించడం, దౌర్జన్యాలకు పాల్పడటంలాంటి పనులెన్నో అధర్మమే, నష్టమే.

అలాగే స్త్రీలపై అత్యాచారాలు చెయ్యడం, అమ్మాయిలను వేధించడం, ఏడిపించడం, వ్యభిచరించడం లాంటి ఇష్టమైన పనులన్నీ చివరకు నష్టాన్ని కలిగిస్తాయి.

అలాగే చాలా మందికి మద్యం సేవించడం ఇష్టం. జూదం ఆడటం అంటే పేకాట, పందాలు కాయడం ఇష్టం. గుట్కా, మత్తు మందులు సేవించడం ఇష్టం. కానీ ఇవన్నీ ఏదో రకంగా నష్టం కలిగించేవే. పండగలలో కోళ్ళ పందాలు, గొర్రెల పందాలు, ఎద్దుల పందాలు చూడటానికి సరదాగా ఇష్టంగా వుంటాయి. కానీ వాటి ఫలితం కష్టాల రూపంలో అనుభవించాలి.

అలా మనం గమనించుకుంటూ పోతే మనం చేసే ఇష్టమైన పనులు ఎన్నో మనకు నష్టం కలిగించేవే వుంటాయి. అందుచేత మనం చేసే పని మనకు ఇష్టమా? కాదా? అని చూడకూడదు. అది నష్టమా? కాదా? అని

చూడాలి.

నష్టాన్ని కలిగించేవి ఇష్టమైనా చేయకూడదు. అలాగే నష్టం కలిగించని పనులు, లాభం కలిగించే పనులు కష్టమైనా చెయ్యటానికి ప్రయత్నించాలి.

అలాగే టి.వి.లు చూడటం, నవల్సు చదవడం, పేపర్లు చదవడం, కబుర్లు చెప్పడం, చాలా మందికి ఇష్టం కానీ, ఆ పని చెయ్యడం వల్ల ఎంతో సమయాన్ని నష్టపోతున్నామన్న సంగతి వారికి తెలియదు.

అలాగే చాలా మందికి పుచ్చుకోవడం ఇష్టం, కానీ ఈ సృష్టిలో పుచ్చుకొన్నవాడు మరల తిరిగి ఇవ్వాలి. అలాగే ఇవ్వడం చాలా కష్టం, కానీ ఇచ్చినవాడు తప్పక తిరిగి పొందుతాడు. ఎందుచేతనంటే ఈ సృష్టిలో ఇవ్వకుండా ఏదీరాదు, ఏదీ పొందలేరు. ఈ సృష్టి ధర్మమేమిటంటే ఏది ఇస్తే అదే పొందుతారు. ఎంత ఇస్తే అంతే పొందుతారు.

అందుచేత ఇష్టమని పుచ్చుకోవడం కాదు, కష్టమైనా ఇవ్వడానికి ప్రయత్నించండి. తప్పకుండా లాభపడతారు. ఎందుచేతనంటే పుచ్చుకునేటపుడు బాగానే వుంటుంది కానీ తిరిగి ఇవ్వవలసి వచ్చినపుడే అసలైన బాధ అంతా.

మరి ఎవరైనా ధర్మంగా ప్రవర్తించాలన్నా, కష్టమైనా ఇవ్వగలగాలన్నా జ్ఞానం పొందాలి. ఆ జ్ఞానం "శ్వాస మీద ధ్యాస ధ్యానం" ద్వారానే వస్తుంది. ధ్యానం ద్వారా జ్ఞానం పొందిన వారు ఇష్టం గురించి ఆలోచించరు. నష్టం లేని పనులే చేస్తారు. అందుచేత ధ్యానం చెయ్యండి. జ్ఞానం పొందండి.

# ఏదైనా పరిమితులకు లోబడి వుండాలి

ఎవరి మధ్య వున్న బంధమైనా పరిమితులకు లోబడి వుంటే సజావుగా సాగుతుంది. పరిమితులు దాటితే బంధం విచ్ఛిన్నమయ్యే ప్రమాదం కూడా వుంటుంది.

అలా తల్లి, తండ్రి, పిల్లల మధ్య కానీ, స్నేహితుల మధ్య కానీ, భార్య–భర్తల మధ్య కానీ, యజమాని–పనివాళ్ళ మధ్య కానీ ఆఖరికి గురువు–శిష్యులు మధ్య కానీ వున్న బంధం కొన్ని పరిమితులకు లోబడి వుంటుంది. ప్రతి ఒక్కరూ ఇది తెలుసుకుని ప్రవర్తించాలి. ముఖ్యంగా ఎదుట వారి అభిప్రాయాలు తెలుసుకుంటూ, దానికి అనుగుణంగా ప్రవర్తించాలి. అంతేకానీ మీ అభిప్రాయాలను వారి మీద రుద్దటానికి ప్రయత్నిస్తే మాత్రం ఘర్షణలు తప్పవు. ఎప్పుడో ఒకప్పుడు వారితో బంధం కూడా తెగిపోక తప్పదు.

అందుకే తాడు తెగేదాకా లాగకూడదు అంటారు. లాగాలి... రాకపోతే వదిలెయ్యాలి. కానీ గట్టిగా లాగితే తెగిపోక ఏమవుతుంది?

అలాగే చెప్పాలి. చెయ్యకపోతే, వినకపోతే నీ ఇష్టం, నీ కర్మ అని వదిలివెయ్యాలి కానీ... ఎందుకు వినవు? నేను ఏం చెప్పినా నువ్వు వినవలసిందే? అని బలవంతం చేసినా, దూషించినా ఇంక ఏ విధమైన చర్యలు తీసుకున్నా అది తల్లి అయినా, తండ్రి అయినా, స్నేహితుడయినా, భార్య అయినా, భర్త అయినా, యజమాని అయినా, ఆఖరికి గురువు అయినా ఎప్పుడో ఒకప్పుడు ఆ బంధం తెగిపోక తప్పదు.

ఈ విషయం గురువులకు బాగా తెలుసు కాబట్టి ఏ గురువు శిష్యుణ్ణి ఏ విషయంలోను బలవంతపెట్టరు. నేను చెబుతున్నాను, నువ్వు చెయ్యాల్సిందే అని అనరు. శిష్యుని ఉద్దేశ్యాన్ని బట్టే చెబుతూ వుంటారు. శిష్యుడు నాకు ఇలా చెయ్యాలని వుంది గురువుగారు అని అంటే! తప్పకుండా చెయ్యి నాయనా, నువ్వు ఆ పని చెయ్యడానికే జన్మించావు, నువ్వు ఆ పనే చెయ్యాలి అని చెబుతారు. అంతే తప్ప అలా వద్దు, అలా చెయ్యకు! ఇలా చెయ్యి, ఇది చెయ్యి అని చెప్పరు. శిష్యుని ఉద్దేశ్యానికి విరుద్ధంగా సలహా ఇవ్వరు. కారణం వాడు స్వానుభవం పొందలేదు కాబట్టి. ప్రతి ఒక్కరి జీవితంలో స్వానుభవం అన్నది

చాలా ముఖ్యం. స్వానుభవం లేకుండా ఎవరిలోనూ పరివర్తన కలుగదు. అవగాహన కలుగదు. మార్పు రాదు.

అందుచేత వాడంతట వాడు తెలుసుకునేదాక ఆగుతారు. ఎదురుచూస్తారు. వీలవుతే పరోక్షంగా, తెలియపరచడానికి ప్రయత్నిస్తారు. సరైన గురువు సరైన అర్హత కలిగిన శిష్యుని విషయంలో ఈ విధంగా ప్రవర్తిస్తూ సహనం చూపిస్తూ, అతనిలో మార్పు కలిగే వరకు ఓపిక పడతారు. అతనితో ఉన్న బంధాన్ని కొనసాగిస్తారు.

కానీ సంసారాల్లో చూసినా, సమాజంలో చూసినా ప్రతి ఒక్కరూ ఎదుట వారి ఉద్దేశ్యం గ్రహించరు, ఎదుట వారి ఆలోచనకు ప్రాముఖ్యం ఇవ్వరు. ఎదుట వారి ఇష్టాయిష్టాలను పట్టించుకోరు, వారి ఇబ్బందులు పరిగణనలోకి తీసుకోరు. ఎంతసేపూ తమకు ఇష్టమైనదే వారికి ఇష్టమవ్వాలి. తమకు ఇష్టం లేని వారు వారికి కూడా ఇష్టం కాకూడదు. తను చెప్పిందే చెయ్యాలి, వద్దంటే మానెయ్యాలని బలవంతం చేస్తారు. తన పెద్దరికాన్ని, అధికారాన్ని, ఆధిపత్యాన్ని, ఆధిక్యతనూ ప్రదర్శిస్తారు. అవతలివారు చెప్పినా వినరు. ఇది చివరకు ఎంతవరకు దారి తీస్తుందంటే వారిద్దరి మధ్య వున్న బంధాన్ని పూర్తిగా తెంచేస్తుంది. ఇద్దరినీ దూరం చేస్తుంది. ఒక్కొక్కసారి జీవితాంతం దూరం చేస్తుంది.

ఇది సహజంగా తల్లి, తండ్రి పిల్లల మధ్య మనకు కనిపిస్తుంది. తల్లిదండ్రులు పిల్లలను బాగా చదువు, మంచి మార్కులు తెచ్చుకో, ఫస్ట్ ర్యాంకు రావాలి, ఎక్కువ శాతం మార్కులు రావాలని ఒత్తిడి చేస్తుంటారు.

ఇంకా ఎదిగిన పిల్లలవుతే ఉద్యోగం చెయ్యట్లేదని, సంపాదించట్లేదని కొందరు పెద్దలు, పెళ్ళి చేసుకోవట్లేదని మరికొందరు పిల్లల్ని తిడుతుంటారు. ఒత్తిడి చేస్తుంటారు. అలాగే అన్నీ వుంటాయి, పిల్లలు లేకపోతే, వారిదే ఏదో తప్పయినట్టు విమర్శిస్తారు. సూటిపోటి మాటలతో బాధిస్తూ వుంటారు.

అంతేకాని పిల్లల బాధ, వారి ఇబ్బంది పట్టించుకోరు. చివరకు ఆ పిల్లలు తమ తల్లిదండ్రుల మీద వున్న ప్రేమ స్థానంలో ద్వేషం పెంచుకుంటారు. అది పెరిగి పెరిగి పెద్దదై వారు పెరిగిన తరువాత, ఆ ద్వేషాన్ని ఆ తల్లిదండ్రుల మీదే చూపిస్తారు. పైకి కలిసి వుంటారు లోపల బంధం తెంచుకుంటారు.

తరువాత నా పిల్లలు నా మాట వినటం లేదు, నన్ను సరిగా చూడటం లేదు అని ఎంత బాధపడినా ప్రయోజనం ఉండదు.

అలాగే కొంతమంది పిల్లలను తాము నిర్ణయించిన వారినే పెళ్ళి చేసుకోమని ఒత్తిడి చేస్తుంటారు. బలవంతం చేస్తూ వుంటారు. పిల్లల అభిప్రాయాలు పట్టించుకోరు. దాని ఫలితం అనుభవిస్తారు కూడా.

అందుచేత ఎవరైనా సరే ఎదుట వారి అభిప్రాయాలు కూడా పరిగణనలోకి తీసుకోవాలి. వారు కూడా తన లాంటి వారేనని తెలుసుకోవాలి. వారికీ స్వంత అభిప్రాయాలనేవి వుంటాయని తెలుసుకోవాలి.

ముఖ్యంగా వారు ఆత్మలని తెలుసుకోవాలి. వారు, వారి స్వంత ప్రణాళికతో, లక్ష్యాలతో కొన్ని అనుభవాలు పొందటానికి, పాఠాలు నేర్చుకోవటానికే భూమి మీదకు వచ్చారని తెలుసుకోవాలి. వారి ప్రణాళిక ప్రకారమే వారు జీవిస్తారు, ప్రవర్తిస్తారు తప్ప మీ అభిప్రాయాల ప్రకారం వారు జీవించరు, ప్రవర్తించరు, వినరు అన్నది అర్థం చేసుకోవాలి. ఏదైనా వారికి అనుభవం కలగాలి. చెపితే వినరు. అప్పటి దాకా ఓపిక పట్టాలి. ఒకవేళ నష్టం జరిగినా సరే. కుటుంబం కష్టాలు పాలైనా సరే!

అంతేకానీ తాడు తెంచితే బంధం తెగిపోతుంది. ఇంకా ఎక్కువ నష్టం జరుగుతుంది. భౌతికంగా కాకపోయినా, మానసికంగా తెగిపోతుంది. అపుడు అక్కడ సుఖశాంతులు వుండవు. ఇది అర్థం కావాలన్నా, ఇటువంటి స్థితి నుంచి బయటపడాలన్నా 'జ్ఞానం' పెంచుకోవాలి. ఎందుచేతనంటే జ్ఞానం లేకపోవడం వల్లే చాలా సంసారాల్లో సుఖశాంతులు లేవు.

ఎప్పుడూ తగవులే, ఘర్షణలే. దీనికంతటికీ అజ్ఞానమే కారణం. అందుచేత 'జ్ఞానం' సంపాదించుకోవాలి. మరి 'జ్ఞానం' పెరగాలంటే ధ్యానం చెయ్యాలి. ధ్యానం చేసేవారే ఇలాంటివి అధిగమిస్తారు. అర్థం చేసుకుంటారు. అవగాహన చేసుకుంటారు. అన్యోన్యంగా, ఆనందంగా జీవిస్తారు.

# ఏది నీది?

ఈ ప్రపంచంలో ప్రతి ఒక్కరు తనకున్నవన్నీ తనవని అనుకుంటారు, అలా తాను సంపాదించిన ఆస్తులు, సంపదలు, భూములు, బంగారం, కార్లు, షేర్లు లాంటి వన్నీ తమవనే భావిస్తారు. అవి నీవేనా? అని అడిగితే మరి నావి కాకపోతే ఎవరివి? అని కూడా అంటారు. కానీ అవి ఎంత వరకు నీవి? అసలు అవి ఎవరివి? అసలు ఏది నీది? అన్నది తెలుసుకోలేక పోతున్నారు. కానీ తెలుసుకోవాలి.

ఉదాహరణకు రైళ్ళు, రైల్వే ఆస్థులు అన్నీ ప్రభుత్వానివే. అటువంటి ప్రభుత్వానికి చెందిన రైళ్ళలో ప్రయాణం చేసేటపుడు టిక్కెట్టు తీసుకుని ప్రభుత్వం నుంచి ప్రయాణించడానికి అనుమతి తీసుకుంటాం. ఆ టిక్కెట్టు ద్వారా కొన్ని గంటలు ప్రయాణించటానికి అనుమతి లభిస్తుంది. అలాగే ఒక సీటు కానీ, బెర్తు కానీ రైలులో ప్రయాణించేటపుడు కేటాయించబడుతుంది. ఆ ప్రయాణం చేస్తున్నంత సేపూ ఆ సీటు తనదే. ఆ సీటు మీద ఎవరికీ హక్కు వుండదు.

అందుచేత ప్రయాణిస్తున్నంత సేపూ ఆ సీటు నాదే అంటాడు. కారణం హక్కు పొందాడు కనుక. అందుచేత ఇంక ఎవరినీ కూర్చోనివ్వడు. ఒకవేళ కూర్చున్నా వారితో దెబ్బలాడి వారిని తోసేసి తన సీటును కాపాడుకుంటాడు, భద్రంగా వుంచుకుంటాడు. తానే కూర్చుని సుఖంగా ప్రయాణిస్తాడు.

కానీ ఎంత వరకు ప్రయాణించాలో అంత వరకు ప్రయాణించిన తరువాత, తనకు ఇవ్వబడిన అనుమతి పూర్తి అయిన వెంటనే ఆ సీటు కాళీ చేయవలసి వస్తుంది. ఇక ఆ సీటు మీద తనకు ఏ మాత్రం హక్కు వుండదు. ఇక ఆ సీటును నాది అని కూడా అనడు, అనలేడు. వెంటనే సీటు కాళీ చేసి వెళ్ళిపోతాడు, వెళ్ళిపోవాలి కూడా. ఒకవేళ నాది అని ఆ సీటులో కూర్చున్నా. ఆ సీటు అర్హత పొందిన మరొకడు వస్తాడు. వాడు నాది అంటాడు. అప్పటి దాకా నాది అన్నవాడు అది వెంటనే కాళీ చెయ్యవలసి వస్తుంది, కాళీ చేస్తాడు కూడా.

ఆలోచించండి నాది అన్నది ఎంత వరకు నాది అయ్యింది? అంటే అర్హత పొందినంత వరకే. ఇంతకీ అసలు అది ఎవరిది? అంటే ప్రభుత్వానిది. ప్రభుత్వానికి చెందిన దానిని నాది, నాది అంటున్నాడంటే అనుకుంటున్నాడంటే ఎంత అవివేకమో చూడండి. అసలు అది నీది కాదు, వూరికే ప్రయాణం చేసేంత వరకే నీకు కేటాయించబడింది. అది కూడా ప్రయాణం కోసమే. అంతేకానీ అది అసలు నీదెలా అవుతుంది? నీది కానే కాదు.

నీవు కొంతసేపు దానిలో ప్రయాణించటానికి అనుమతి లభించింది. అలా ప్రయాణిస్తూ అది నీదని భ్రమిస్తున్నావు. అది నీదవుతే అందులోనే వుండిపొమ్మంటే వుండిపోతావా? వుండవు కదా? వుండమన్నా వుండవు కదా? కారణం నువ్వు అక్కడ వరకే వుండటానికి నిర్ణయించుకుని వచ్చావు. అందుచేత వుండమన్నా వుండవు. ప్రయాణం ముగింపు దశకు చేరుతూంగానే దానిని కాళీ చెయ్యడానికి సిద్ధపడతావు. ఎదురు చూస్తావు? మరి అలా వదిలి వేయటానికి ఎందుకు సిద్ధపడ్డావు? అందులోనే కూర్చోవచ్చు కదా? కానీ కూర్చోవు. కారణం నీకు అనుమతి లేదు. ఒకవేళ కూర్చుందామన్నా కూర్చోనివ్వరు. నిన్ను టి.సి. వచ్చి దింపేస్తాడు. లేకపోతే రక్షక భటులు వచ్చి నిన్ను తీసుకు వెళ్ళిపోతారు. అపుడు నాది అనగలవా? అనలేవు కారణం నీది కాదు కనుక. అందుచేత నీది కాని దాన్ని నీది అనుకోకు. నాదనే భ్రమలో వుండకు.

ఇక్కడ ఆ సీటు నీదా? కాదా? అన్నది ప్రశ్న కాదు. అసలు నీ ప్రయాణ ఉద్దేశ్యమేమిటి? నీ ప్రయాణ లక్ష్యమేమిటి? నీ ప్రయాణ గమ్యమేమిటి? అన్న దాని మీద దృష్టి వుంచాలి. ఆలోచించాలి, సీటు నాది, సీటు నాది అని మురిసిపోతే చివరకు భంగపడతావు. అందుచేత ఏదైనా కొంతవరకే నీది అని తెలుసుకో. కారణం నీదనుకున్నది ఏదీ నీది కాదు. నువ్వే కనుక ప్రయాణిస్తున్నంత సేపూ ఆ భావంతో వుంటే భంగపడవు.

అలాగే యీ ప్రపంచంలో అందరూ తమకున్న వాటిని నాది, నావి అంటారు. నాదని గొప్పలు చెప్పుకుంటారు. నాకు యింత వుందని

గర్విస్తారు. వాటిని చూసి మురిసిపోతుంటారు. నావని భ్రమ పడుతుంటారు. చివరకు అవి పోయినా, దూరమైనా బాధపడతారు, భంగపడతారు.

కానీ సత్యం తెలుసుకుంటే ఈ ప్రపంచంలో వున్న సంపదలన్నీ భగవంతునివే, భగవంతునిచే సృష్టింపబడినవే. అవి ఎవరివి కావు. ఈ విషయమే ఈశావాశ్య ఉపనిషత్తులో చెప్పబడింది.

**శ్లో॥ "ఈశావాశ్యమిదం సత్యం యత్కించ జగిత్యాంజగత్**
**తేనత్యక్తేనబుంజిదామాగృధం కస్యశ్శిద్ధినమ్ ! "**

తా:- ఈ సమస్త సృష్టి ఈశ్వరునిచే వ్యాపించబడినది. సమస్తము ఈశ్వరునకు చెందినవే. అందుచేత త్యాగబుద్ధితో అనుభవించు. ఎవరిదీ ఆశించకు, అపహరించకు.

అంటే మన వనుకునే సంపదలు, ఆస్తులు అన్నీ భగవంతునికి చెందినవే. భగవంతునివే అని ముందు మనం తెలుసుకోవాలి.

భూమి మీదకు వచ్చిన మనం రైలులో టిక్కెట్టు తీసుకుని ప్రయాణింటానికి అర్హత పొందినట్టే మనం కూడా ఈ దేహం తీసుకుని జీవిత ప్రయాణం సాగించటానికి గత జన్మలలో చేసుకున్న కర్మలను బట్టి కొన్ని సంపదలు పొందే అర్హత సంపాదించాం. డబ్బు ఇచ్చిన దాన్ని బట్టి ఆర్డినరీ, స్లీపర్, ఎ.సి.లో ఎలా ప్రయాణించటానికి టిక్కెట్టు ఎలా ఇవ్వబడుతుందో! అలాగే కర్మలు చేసిన దాన్ని బట్టి వారికి కొన్ని సంపదలు కేటాయించబడతాయి. దేహం ఇవ్వబడుతుంది.

ఆ ప్రయాణం చేసేంత వరకు ఆ సీటు అతనికెలా కేటాయించబడిందో! జీవిత ప్రయాణం చేసేంత వరకు ఈ సంపదలు వీరికి కేటాయించబడ్డాయి. ఆ సీటు ఇన్ని గంటలు ప్రయాణానికి ఎలా కేటాయించబడుతుందో అలాగే ఈ సంపదలు అవి వేలు కావచ్చు, లక్షలు కావచ్చు. కోట్లు కావచ్చు. ఏదైనా ఇన్ని సంవత్సరాల జీవిత ప్రయాణానికి కేటాయించబడతాయి.

రైల్వే ఆస్థిని కొంతకాలం ప్రయాణించడానికి ఎలా ఉపయోగించు కుంటామో అలాగే భగవంతుని సంపదలు కొంతకాలం జీవిత ప్రయాణానికి ఉపయోగించుకుంటాం. రైలు ప్రయాణం అయిపోగానే ఎలా సీటు వదిలేసి

ఎలా దిగిపోతామో? అలాగే జీవిత ప్రయాణం అయిపోగానే సంపదలు వదిలేసి వెళ్ళిపోతాము.

ఆ ప్రయాణం చేసేంత వరకు ఆ సీటు మీద హక్కు ఎలా వుంటుందో? నాది నాది అని ఎలా అంటూ వుంటామో? అలాగే జీవిత ప్రయాణం చేసేంత వరకు ఆ సంపదల మీద హక్కు వుంటుంది నాది నాది అంటాం.

కానీ నిజంగా **"రైల్వేలు ప్రభుత్వ ఆస్తి ఎలాగో? ఈ సంపదలు అన్నీ భగవంతుని ఆస్తులు".** తాత్కాలికంగా ఉపయోగించుకోవటానికి ఇవ్వబడ్డాయి అంతే.

అందుచేత జీవిత ప్రయాణం చేస్తున్నంతసేపూ ఆ సంపదలు నావి, నావి అంటూ వుంటాం. ఎవరిని ముట్టుకోనివ్వం. ఎవరైనా వాటి జోలికి వచ్చినా దెబ్బలాడతాం, సంపదలు కాపాడుకుంటాం, భద్రంగా వుంచుకుంటాం. కానీ ప్రయాణం పూర్తి కాగానే ఆ సీటు మీద ఏ మాత్రం హక్కు ఎలా వుండదో? అలాగే జీవిత ప్రయాణం పూర్తి కాగానే ఆ సంపదల మీద ఏ మాత్రం హక్కు వుండదు, వదిలేసి వెళ్ళిపోవాలి. ఆ సీటు మరొకరికి కేటాయించబడినట్టు ఆ సంపదలు మరియొకరికి కేటాయించబడతాయి.

ఇక్కడ గమనిస్తే నాది నాది అని అనుకుంటారు, అంటారు. కానీ ఎంత వరకు తనదయ్యింది? ప్రయాణం సాగించినంతసేపే కదా? ప్రయాణం అయిపోతే నాది అని అనగలరా? అనలేరు కదా? తరువాత వచ్చిన వారు మరల నాది అంటారు. ఇంతకీ అది ఎవరిది? అంటే అది ఎవరిది కాదు.

ఈ విషయం తెలియక అజ్ఞానులు నాది, నాది అనుకుంటూ మురిసి పోతూంటారు. చూసుకుని గర్వపడతారు. గొప్పగా గొప్పలు చెప్పుకుంటారు. గొప్పవారైపోయినట్టుగా భ్రమపడతారు. అన్నీ తమవేననే భ్రమతో అవన్నీ సంపాదించటానికి తప్పులు చేస్తారు. పాపాలు చేస్తారు. అధర్మంగా వ్యవహరిస్తారు. ఇవన్నీ ఎందుకు చేస్తారు? అంటే తనవని భావించడం వల్లే.

కానీ జ్ఞానులకు ఏదీ తనది కాదు అన్నది తెలుసు. అంతా

ఈశ్వరునిదే అన్న అవగాహన వుంటుంది. అందుచేత వాటి మీద మమకారం పెంచుకోరు. వాటిని చూసి మురిసిపోరు. వాటిని సంపాదించడానికి తప్పులు, పాపాలు చెయ్యరు. అది తన జీవిత లక్ష్యం సాధించటానికి తాత్కాలికంగా తన అర్హతను బట్టి కేటాయించబడ్డాయని తెలుసుకుంటారు. ఒక రకంగా రైల్వేఆస్తులు ఎలా ప్రభుత్వానివో అలాగే ఈ ప్రపంచంలోని సంపదలు అన్నీ భగవంతునివే.

అలా ప్రయాణిస్తూ నాది అని భ్రమిస్తున్నావు. అసలు ఆ సంపదలు జీవిత ప్రయాణం సాగించటానికే. ఎంతకాలం ప్రయాణం సాగించాలని నిర్ణయించుకుని వస్తావో అంతకాలం దానికి ఉపయోగించుకుంటావు. అంతేకానీ నాది అని వెళ్ళేటపుడు కూడా పట్టుకు వెళ్ళగలనా? లేదు కదా?

గమనించండి రైలు ప్రయాణం చివరి దశకు చేరుతూండగానే కాళీ చేయడానికి సిద్ధపడినట్లు గానే జీవిత ప్రయాణ వార్థక్యంలో చివరి దశకు చేరుకోగానే వెళ్ళిపోవడానికి సిద్ధపడతారు. సిద్ధపడాలి కూడా.

కారణం గమ్యం రాగానే రైలులో ఇంకా వుందామన్నా ఉండనివ్వరు. టి.సి. వచ్చి పంపేస్తాడు. లేకపోతే రక్షకభటులు బలవంతంగానైనా పంపేస్తారు. అలాగే భూమి మీద ఇంకా వుందామన్నా ఉండనివ్వరు. యముడు లేకపోతే యమభటులు వచ్చి బలవంతంగానైనా తీసుకు వెళతాడు. అపుడు ఈ సంపద నాది అని అనగలరా? కారణం అది ఎవరిది కాదు కనుక! అంతా భగవంతునిదే! ఈశ్వరునిదే!

అందుచేత జ్ఞానులులాగే ఈ ప్రాపంచిక సంపదల మీద వ్యామోహం పెంచుకోకూడదు. వాటిని సంపాదించి కూడపెట్టడానికి ప్రయత్నించ కూడదు. వాటి కోసం మీ సమయాన్ని, శక్తిని, యుక్తిని, జీవితాన్ని వృథా చేసుకోకూడదు.

జ్ఞానులు తమది కాని దాన్ని, తమ కూడా రాని దాన్ని సంపాదించ డానికి ప్రయత్నించరు. తమ బుద్ధిని ఉపయోగించి తమకు లాభించేది జ్ఞానమే అని తెలుసుకుంటారు. ఆ జ్ఞానమే తమ కూడా వస్తుందని తెలుసుకుంటారు. అందుచేత వారు తమకు లాభించని ధనం గురించి ఆసక్తి చూపించరు. తమకు లాభించే జ్ఞానం సంపాదించటానికి ఎక్కువ

ప్రాముఖ్యం ఇస్తారు. తమ సమయాన్ని, జీవితాన్ని జ్ఞానం పెంచుకోవడానికి వినియోగిస్తారు.

దాని కోసం విశేషంగా ధ్యాన సాధన చేస్తారు. జ్ఞానుల పుస్తకాలు చదువుతారు. అటువంటి వారితో సాంగత్యం చేస్తారు. అపారమైన జ్ఞానాన్ని సంపాదించుకుని శరీరం వదిలిన తరువాత ఊర్ధ్వ లోకాలు చేరుకుని జీవితాన్ని ధన్యం చేసుకుంటారు.

అందుచేత ఇక్కడ ఏదీ నీది? అంటే ఏదీ నీది కాదని ప్రతి ఒక్కరూ తెలుసుకోవాలి. రైల్లో ప్రయాణం చెయ్యడానికి కొంతమందికి జనరల్, కొంతమందికి స్లీపర్, కొంతమందికి ఎ.సి.3 టైర్, 2 టైర్ ఎలా కేటాయించబడ్డాయో అలాగే అర్హతను బట్టి ఈ భూలోకంలో సంపదలు లక్షలు కానీ, కోట్లు కానీ తాత్కాలికంగా కేటాయించబడ్డాయి. అంతేకానీ ఇక్కడ ఏదీ ఎవరిదీ కాదు. అంతా ఈశ్వరునిదే అని తెలుసుకోండి. అనవసరంగా ఈ సంపదలపై వ్యామోహం పెంచుకోకండి. వాటి కోసం అధర్మంగా వ్యవహరిస్తూ తప్పులు, పాపాలు చెయ్యకండి. జీవితాన్ని నష్ట పరచుకోకండి. ముందు రమణ మహర్షుల వారు చెప్పినట్టు మీరెవరో తెలుసుకోండి. మీకు లాభించేది జ్ఞానమని తెలుసుకోండి. ధ్యానం చేసి జ్ఞానాన్ని సంపాదించుకోండి. జీవితాన్ని ధన్యం చేసుకోండి.

**"ఉన్నన్నాళ్ళు 'నీది', 'నాది' అనుకోవటమే కానీ క్రియకు వచ్చేది ఎవ్వరిదీ కాదు – అంతా భగవంతునిదే"**

**– శ్రీ బాలయోగి**



# "ధ్యానమేవ శరణం వయం"



సమస్యలు ఎన్నెన్నో ... పరిష్కార మార్గం మాత్రం ఒక్కటే

ప్రశ్నలు ఎన్నెన్నో .. సమాధానాలు పొందే మార్గం మాత్రం ఒక్కటే

బలహీనతలు ఎన్నెన్నో ... బలం పుంజుకునే మార్గం మాత్రం ఒక్కటే

సంశయాలు ఎన్నెన్నో ... నివృత్తి చెందించే మార్గం మాత్రం ఒక్కటే

భిన్న భిన్న దృక్పథాలు, వ్యత్యాసాలు ఎన్నెన్నో ...

ఏకీకరణ మార్గం మాత్రం ఒక్కటే. దుఃఖాలు ఎన్నెన్నో ...

దుఃఖ నివారణోపాయ మార్గం మాత్రం ఒక్కటే.

అజ్ఞానరీతులెన్నెన్నో ... జ్ఞానరీతి మాత్రం ఒక్కటే

**"ధ్యానం"** అన్నది సకల దుఃఖాల **నివారిణి**

భవిష్యత్తులో ఖచ్చితంగా రాబోయే శారీరక రోగాలను,

మానసిక దుఃఖాలను ఇక రాకుండా చేసేదే ధ్యానం

**"ధ్యానం"** అన్నది సకల దుఃఖాల **హారిణి**

వర్తమానంలో అనుభవిస్తూన్న శారీరక రోగాల మానసిక దుఃఖాల

నుంచి ముక్తిని ప్రసాదించేదే ధ్యానం

**"ధ్యానం"** అన్నది సకల భోగాల **కారిణి**

ధ్యానం ద్వారా మనలోని దోషాలన్నీ తొలగి గుణాలన్నీ అభివృద్ధి చెంది

ఎడతెరిపి లేని .. భోగాల పరంపరకు మనం వారసులం అవుతాం.

మనలోని దోషాల ద్వారా .. రోగాలు సంభవిస్తాయి ...

దుఃఖాలు ఉద్భవిస్తాయి

మనలోని గుణాల ద్వారా భోగాలు కలిగించుకుంటాము.

**"ధ్యానం"** అన్నది సత్యజ్ఞాన **ప్రసాదిని**

అనునిత్య ధ్యాన అభ్యాసం ద్వారా సత్యమైన

నిత్యమైన ఆత్మజ్ఞానాన్ని పొందుతాం.

**ఆత్మ** అన్నది నిత్యమైనది .. సత్యమైనది

**ఆత్మ** అన్నది అజరామరమైనది

**ఆత్మ** అన్నది సనాతనమైనది .. శాశ్వతమైనది

సృష్టి అంతా కూడా **బృహత్ ఆత్మ** యొక్క విరాట్ స్వరూపమే

సృష్టి అంతా కూడా **విరాట్ ఆత్మ** యొక్క బృహత్ క్రీడాలీలా విన్యాసమే

**"మమాత్మా సర్వభూతాత్మా"**

అంటే

**"నా యొక్క ఆత్మయే ... నిరంతరంగా వుండే నేనే ... సర్వభూతాల యొక్క విరాట్ఆత్మ కూడా"**

ధ్యాన సాధన ద్వారా ఈ విధమైన **"అనుభవ జ్ఞానం"** మనకు

కలుగుతుంది కనుకనే ధ్యానం అన్నది **"సత్య జ్ఞాన ప్రసాదిని"**

ప్రతి స్త్రీకి, ప్రతి పురుషుడికీ .. ప్రతి పండితుడికీ, ప్రతి పామరుడికీ...

ప్రతి బాలుడికీ, ప్రతి బాలికకూ .. ప్రతి ధనికుడికీ, ప్రతి పేదవాడికీ

ప్రతి రోజూ విశేషంగా అవసరమైనదే .. రోజువారీ ధ్యాన సాధన

మన అందరికీ ధ్యానం ఒక్కటే శరణ్యం!

**– బ్రహ్మర్షి పత్రీజీ**

# "ఒకానొక బుద్ధుడు"

ఒకానొక **"బుద్ధుడు"** అంటే .. ఒకానొక సగటు మనిషి

ఒకానొక **"బుద్ధుడు"** అంటే ...

"అందరూ సగటు సామాన్య మనుష్యులే" అని తెలుసుకున్నవాడు.

ఒకానొక **"బుద్ధుడు"** అంటే .. "తనలో ఏ ప్రత్యేకతలూ లేవు" అని తెలుసుకున్నవాడు

ఒకానొక **"బుద్ధుడు"** అంటే .. "ఇతరులు అందరిలో కూడా ఏ ప్రత్యేకతలూ లేవు" అని తెలుసుకున్నాడు.

ఒకానొక **"బుద్ధుడు"** అంటే .. "ఇతరులు అందరూ కూడా శూన్యం" అని తెలుసుకున్నవాడు.

ఒకానొక **"బుద్ధుడు"** అంటే .."తాను ఒక మహాశూన్యం" అని తెలుసుకున్నవాడు.

ఒకానొక **"బుద్ధుడు"** అంటే .. "ఇతరులందరూ కూడా ఒక మహాశూన్యం" అని తెలుసుకున్నవాడు.

ఒకానొక **"బుద్ధుడు"** అంటే .. తన శరీరంతో తాను తాదాత్మ్యం చెందినవాడు ఒకానొక **"బుద్ధుడు"** అంటే .. తన రోజువారీ సాధారణ దిన చర్యల కార్యక్రమాలతో **తాదాత్మ్యం** చెందినవాడు

**"రోజువారీ సాధారణ దినచర్యలు"** అంటే **"తినడం"... "కూర్చోవడం"** .. **"చూడడం" ... "మాట్లాడడం" .. "వినడం" .. "పని చెయ్యడం" .. "చదవడం"** .. ఇంకా ఇంకా

"Walk while you are walking ... Eat while you are eating"

అన్నాడు కదా **జగద్విఖ్యాతమైన ఒకప్పటి బుద్ధుడు**

ఒకానొక **"బుద్ధుడు"** అంటే సమాజపరంగా తన కర్తవ్యకర్మల్లో **తాదాత్మ్యం** చెంది వున్నవాడు

ఒకానొక **"బుద్ధుడు"** అంటే సకల ప్రాణికోటితో **తాదాత్మ్యం** చెందివున్నవాడు

**"బుద్ధత్వం"** అన్న పదానికి మారుపేరే ... **"తాదాత్మ్యత"**

తన శూన్యంతో తాను **తాదాత్మ్యత;** తన బాహ్యంతో తాను **తాదాత్మ్యత**

అసలు **"సంఘర్షణ"** అన్న పదానికి తావులేనిదే .. **"బుద్ధత్వం"**

**"భయం" .. "దుఃఖం" .. "సంశయం" ... "ఆవేశం'** అన్న పదాలకు తావులేనిదే **"బుద్ధత్వం"**

అనుక్షణం మార్పు చెందుతూ ఉండే ... రూపాంతరం చెందుతూ ఉండే ... బాహ్యాంతరాలను చిరుమందహాసంతో గమనించే మృదు గంభీరత్వమే .. **"బుద్ధత్వం"**

**బుద్ధుళ్ళందరికీ వందనాలు**

**ఇప్పటికే బుద్ధులు అయినవాళ్ళందరికీ వందనాలు**

**ఇక ముందు బుద్ధుళ్ళు కాబోయేవాళ్ళందరికీ వందనాలు**

– బ్రహ్మర్షి పత్రీజీ



# ధ్యానం చేసే పద్ధతి
# శ్వాస మీద ధ్యాస



ఎవరికి తగిన సుఖాసనంలో వారు హాయిగా కూర్చుని... చేతులు రెండూ కలిపి... కళ్ళు రెండూ మూసుకుని... ప్రకృతి సహజంగా జరుగుతున్న ఉచ్ఛ్వాస, నిశ్వాసలను గమనిస్తూ వుండాలి!

మధ్యమధ్యలో అనేకానేక ఆలోచనలు వస్తున్నా వాటిని ఎప్పటికప్పుడు 'కట్' చేస్తూ... మళ్ళీ, మళ్ళీ శ్వాస మీదకే... ధ్యాస మరల్చుతూ వుంటే.. క్రమ క్రమంగా... ఆలోచనా రహిత స్థితి కలుగుతుంది.... చిత్తవృత్తులు నిరోధించబడతాయి... మనస్సు నిర్విషయం, శూన్యం అయిపోతుంది. మనస్సు శాంతిస్తుంది. ఇదే ధ్యాన స్థితి.

ఈ ఆలోచనా రహిత స్థితిలో కలిగే అనేకానేక శారీరక, నాడీ మండల, ఆత్మానుభవాలను గమనిస్తూ వుండాలి. ఆ స్థితిలో విశ్వమయ ప్రాణశక్తి. అపారంగా శరీరంలోకి ప్రవేశించి నాడీ మండలాన్ని శుద్ధి చేస్తుంది. ఆ శక్తి వల్ల రోగాలన్నీ తగ్గుతాయి. నాడీమండల శుద్ధి వల్ల కర్మలు పోతాయి.

ప్రతిరోజూ ఎవరి వయస్సు ఎంతుంటుందో... కనీసం అన్ని నిమిషాలు... తప్పనిసరిగా... రోజుకి రెండు సార్లుగా... ధ్యానం చెయ్యాలి.



బ్రహ్మర్షి పత్రీజీ ఆశీస్సులతో...
తటవర్తి వీరరాఘవరావు, శ్రీమతి రాజ్యలక్ష్మి దంపతులచే

## ఆత్మజ్ఞాన శిక్షణా శిబిరం

భీమవరంలో ప్రతీ నెలా 1, 2, 3 తేదీలలో పూర్తి రెసిడెన్షియల్ పద్ధతిన **ఆత్మజ్ఞాన శిక్షణా శిబిరం** నిర్వహించబడుతుంది. ఎన్ని రోజులు ధ్యానం చేసినా ధ్యానంలో పురోగతి సాధించలేనివారు, ఆలోచనలతో ఇబ్బంది పడేవారు ఈ శిబిరంలో పాల్గొంటే ఒకే సిట్టింగులో మూడు లేక నాలుగు గంటలు ధ్యానం చేయగల స్థితికి చేరుకుంటారు. పరిమిత సభ్యులకు మాత్రమే అవకాశం ఉన్నందున ముందుగా మీ పేర్లు నమోదు చేసుకోండి.

*ప్రవేశం :* *మూడు రోజులకు భోజనం, వసతి ఉచితం*
*వేదిక :* *శ్రీ వెంకటేశ్వరస్వామి వారి ఆలయం, నరసింహపురం, ఉండి రోడ్, భీమవరం.*

వివరాలకు : ***తటవర్తి వీరరాఘవరావు,*** *తటవర్తి వారి వీధి, భీమవరం - 534 201.*
*సెల్ : 94403 09812, 94901 71853*

# తటవర్తి వీరరాఘవరావు గారి రచనలు

| | | |
|---|---|---|
| 1) జీవితశాస్త్రం (మొదటి భాగం)- | రూ.100/- |
| 2) జీవితశాస్త్రం (రెండవ భాగం)- | రూ.130/- |
| 3) జీవిత సత్యాలు | - రూ.100/- |
| 4) భగవంతుడంటే | - రూ.130/- |
| 5) సత్యమార్గం | - రూ.130/- |
| 6) ఆత్మ శాస్త్రం | - రూ.100/- |
| 7) ధ్యాన శాస్త్రం | - రూ.100/- |
| 8) జ్ఞానరసగుళికలు (పత్రీజీ) | - రూ.100/- |
| 9) పరమగురువుల ప్రబోధాలు (పత్రీజీ) | - రూ.100/- |
| 10) భగవద్గీతా సారం - శ్రీ కృష్ణ సందేశం | - రూ.130/- |
| 11) ధ్యాన శక్తి | - రూ.100/- |
| 12) తెలుసుకోండి | - రూ.120/- |
| 13) జీవిత సూక్ష్మాలు | - రూ.120/- |
| 14) గీతాసందేశం | - రూ.100/- |
| 15) కర్మ సిద్ధాంతం | - రూ.80/- |
| 16) బ్రహ్మాజ్ఞానం | - రూ.60/- |
| 17) ఆత్మజ్ఞానం ఎందుకు? | - రూ.70/- |
| 18) ధ్యానమంటే ? | - రూ.50/- |
| 19) జ్ఞాన జ్యోతి | - రూ.70/- |
| 20) జ్ఞాన కుసుమాలు | - రూ.70/- |
| 21) దుఃఖ నివారణామార్గం- | రూ.60/- |
| 22) త్రివిధాలు | - రూ.60/- |
| 23) ధ్యానం (పత్రీజీ) | - రూ.50/- |
| 24) ధ్యానం వల్లనే జ్ఞానం | - రూ.60/- |
| 25) అతీంద్రియ శక్తులు | - రూ.60/- |
| 26) శాస్త్రాల అర్థం- అంతరార్థం | - రూ.60/- |
| 27) ఆశ్చర్యం... ఆశ్చర్యం | - రూ.60/- |
| 28) విద్యార్థుల వికాసానికి ధ్యాన విద్య | - రూ.50/- |
| 29) మౌన ధ్యానం | - రూ.40/- |
| 30) ఈ జీవితం ఎందుకు? | - రూ.50/- |
| 31) నిర్వాణ మార్గం | - రూ.50/- |
| 32) షిరిడీసాయి సందేశాలు | - రూ.40/- |
| 33) భాగవత సన్నివేశాల అంతరార్థం | - రూ.40/- |
| 34) భూతదయే దైవత్వం | - రూ.40/- |
| 35) ఆలోచించండి | - రూ.60/- |
| 36) సంకల్పమంటే? | - రూ.50/- |
| 37) మరోజన్మ (తటవర్తి రాజ్యలక్ష్మి) | - రూ.30/- |
| 38) మనం ఇహలోకవాసులమా? పరలోకవాసులమా? | - రూ.20/- |
| 39) శాకాహారమే మానవాహారం | - రూ.15/- |
| 40) అహింస మరియు శాఖాహారం | - రూ.15/- |

పుస్తకముల కొరకు :

**తటవర్తి వీర రాఘవరావు,**

తటవర్తివారి వీధి, భీమవరం-1. ప॥గో॥జిల్లా.

సెల్ : 9440309812, 9490171853



# "ఏడు శరీరాలు"

మనిషి అన్నాక వున్నది ఒక శరీరమే కదా .. అవును ... కాదు.. చూడటానికి ఒక్కటే కానీ అంతర్లానంగా ఆరు శరీరాలు వున్నాయి.

1.**Physical Body** – అన్నమయ కోశం ..స్థూల శరీరం

2.**Etheric Body** – ప్రాణమయకోశం .. కాంతిమయ శరీరం

3.**Astral Body** – భావనామయ శరీరం (మనోమయ కోశం) } సూక్ష్మ శరీరం

4.**Mental Body (Casual Body)** – విజ్ఞానమయ కోశం.. కారణశరీరం

5.**Spiritual Body** – ఆనందమయ కోశం

6.**Cosmic Body** – విశ్వమయ కోశం

7.**Nirvanic Body** – నిర్వాణమయకోశం

} మహాకారణశరీరం (5–7)

– బ్రహ్మర్షి పత్రీజీ

**రూ.70/–**